# మహాకవి - మహాపురుషుడు



# గురజాడ అప్పారావు

రచన

పెట్టి ఈశ్వర్రావు

ఆంధ్రరాష్ట్ర అభ్యుదయ రచయితల సంఘం

బెజవాడ

మహాకవి - మహాపురుషుడు

# గురజాడ అప్పారావు

రచన:

సెట్టి ఈశ్వరరావు



ప్రజాశక్తి కార్యాలయం

బెజవాడ

# పరిచయం

విజ్ఞానానికి సహితం విలువలు మారుతూవుంటవి. ప్రపంచచరిత్ర ప్రాచీనపుటలు తిప్పి తరిచి యోచిస్తే, ఒక్కొక్క యుగంలో ఒక్కొక్క రూపంగా వికసిస్తూవొచ్చిన నాగరికతను ఆధారపరుచుకుని మానవ పరిణామం పరిపరివిధాల పక్వతను పొందుతూ వొచ్చింది.

తన వాతావరణంలో మార్పులు కల్పించుకోడంలో మానవసమాజం విజ్ఞానపరంగా వివిధవిధాల పరిణతను పొందింది. అందుచేతను విజ్ఞానానికి విలువలుకట్టడంలో పడికట్టురాళ్లు పదేపదే మారుతూ వొచ్చినవి.

సమాజజీవితంలో సమిష్టిని కలిగే మార్పు సారస్వతంలో ప్రతిబింబితం కాకతప్పదు. ఈదృష్టితో ఆంధ్రసారస్వతంలోని ఘట్టాలను విభజించి విలువకడితే నవయుగనిర్మాణానికి మూలపురుషులు గురజాడ అప్పారాయకవీ, గిడుగు రామమూర్తి పండితుడూ. వీరిని యిరువురిగా విడదీయడమే కూడదు.

> "రెంటపారెడు రక్తమొక్కటె,
> రెంటవెలిగెడు తేజమొక్కటె,
> రెండనుటె తప్పు" అనక తప్పదు.

పరకీయ - ప్రపత్తిని ఆరాధించడంలో ఆంధ్రులకు అభిలాష హెచ్చు. ప్రాచీనంలో సంస్కృతవాణిని రాణిగా గౌరవించడంలో కవులు ఆంధ్రవాణికి నీచస్థానం కల్పించారు. తరువాత ఆంధ్రవాణిని కొత్త ఆదరించడం కలిగినప్పటికీ సంస్కృతవాణికి కోడరికంచేయడం ఆమెవిధి అయ్యింది. ఆ అత్తగారి అదమాయింపుతో మెలగవలసిన అగత్యం తప్పనందున తన సహజసౌభాగ్యాన్ని ప్రత్యేకసంపదగా, వృద్ధిచేసుకోలేక పోయింది. ఆంధ్రవాణికి అపూర్వ అలంకారాలని భ్రమించి అనాటివారు శబ్దశాసనంతో ఆమెకు కల్పించిన సంస్కృతిశృంఖలాల బంధింపువల్ల ఆమె తనవారైన సామాన్యజనుల ఆదరాభిమానాలకు అందుబాటు కాకుండా పోయింది. ఈ దుస్థితి తప్పించి, బేడీలు విడదీసి, ఆత్మీయులైన సామాన్యజనుల బాంధవ్యం సమకూర్చడంలో ఆమెకు ఆత్మచైతన్యం కలిగించిన మహనీయుడు గురజాడ అప్పారావు.

సంపూర్ణ స్వాతంత్ర్యంతోనూ, సజీవ సౌందర్యంతోనూ, సామాన్య జనుల వ్యవహారబలంతోనూ, విహరించవలసిన శిష్టవ్యావహారభాషను "నీచంగ్రామ్యమ్" అన్న అద్దాన్నపు 'ఆర్డినెన్స్' ప్రయోగంతో గడపదాట నీయకుండా చేశారు గ్రాంధికులు. ప్రజాభాషపక్షాన యెఱ్ఱబావుటా యెత్తి 'ఆర్డినెన్స్'ను ధిక్కరిస్తామని ధైర్యంతో తిరుగుబాటు లేవనెత్తారు రామమూర్తి, అప్పారావుగార్లు.

పండిత ప్రకాండులు తమ పాత విలువలకు గొడ్డలిఱ్ఱవేటు తగిలిందన్న భయంతో పరిషత్తుద్వారా ప్రత్యేకసభలద్వారా ఈ తిరుగుబాటును అణిచివేయడానికి అనేకయత్నాలు చేశారు. యావదాంధ్ర సంచారంచేసి పండితుల భాషాభేషజాన్నీ కృత్రిమ గ్రాంధికవాదాన్నీ అడ్డుకొని తన అపూర్వ పాండిత్య బలప్రదర్శనంతో పండితుల్ని భయభ్రాంతుల్ని చేయడంలో గిడుగు 'పిడుగు' అనే బిరుదు సంపాదించాడు రామమూర్తి. బహిరంగసభలలో, వాదోపవాదాలలో. ఆయన గ్రాంధికవాదాన్ని ఖండించి పాత పండితులను పరిభవిస్తూవుంటే -- అప్పారాయకవి తన ఉజ్వల భావాలనూ, ఉత్తమ లక్ష్యాలనూ, సంఘసంస్కరణ విధానాలనూ, రుచిగల రచనలద్వారా అందరికీ అర్ధమయ్యే తియ్యని తెలుగు వ్యవహారభాషలో సృష్టించి తమ ఉద్యమానికి సరియైన పునాదులు స్థాపించాడు. ఈయన ప్రతిభ ఆకర్షణీయం కావడంవల్ల వాడుకభాషావాదం త్వరలో ప్రజాహృదయాన్ని ఆకర్షించి సుస్థిరరూపాన్ని పొందింది. భావనలో ఈతనికున్న అభ్యుదయ భావాలు భాషావిప్లవంతో జతకూడి ప్రజానీకానికి అనువైన రచనలను దేశానికి అందజేసింది. యుగకర్తగా కావ్యజగత్తు అంగీకరించిన ఈమహనీయుడి జీవితచరిత్ర ప్రజానీకానికి అందుబాటులోలేని కొరతను ఈ గ్రంధం శాయశక్తులా తీర్చడానికి యత్నించింది.

అప్పారాయకవి జీవితంలోని విశిష్టతను వివరిస్తూ గ్రంధకర్త దేశకాలపాత్రల బాంధవ్యాన్ని సమన్వయించి, తన పద్ధతికి సరియైన ప్రయోజనాన్ని సాధించాడు.

బెజవాడ,<br>
2—3—45.

ముద్దుకృష్ణ.

# విషయ సూచిక

# మహాకవి - మహాపురుషుడు

# గురజాడ అప్పారావు



భారతదేశంలో ఇంగ్లీషువారి ప్రభుత్వం సుస్థాపిత మయింది. 'సిపాయిల తిరుగుబాటు'ని *వ్యవహరింపబడే దేశీయుల ఆఖరు స్వాతంత్ర్య పోరాటంకూడా అణచివేయబడింది. తమకు స్వాధీనమైనదేశానికి ఆక్రమణ దారులు చేకూర్చే శాంతిభద్రతలు భారతదేశానికి ఇంగ్లీషు ప్రభుత్వం చేకూర్చింది.

పాశ్చాత్యుల సంస్కృతితోను, సాంప్రదాయాలతోను విద్యావంతులైన భారతీయులకు సంపర్కం కలిగించి. పాలకజాతి పాలితజాతిపట్ల అవలంబించే 'ధర్మా'న్ని అనుసరించి ప్రభుత్వం ప్రవేశపెట్టిన ఇంగ్లీషు విద్యావిధానం — యెంతటి బానిస విద్యావిధానమైనప్పటికీ — తాను కలలోనైనా అనుకోని ఫలితాన్ని యిచ్చింది. తానొకటితలిస్తే ఫలితం ఇంకొకటయింది.

అలసటచేత గాఢనిద్రలో మునిగిపోయిన భారతజాతికి ప్రపంచచరిత్ర మేలుకొలుపులు పాడింది. ఇంగ్లీషుప్రభుత్వం యెంత బుజ్జగించినా మళ్ళీ భారతీయులు నిద్రలో మునిగిపోరని స్పష్టపడుతున్నరోజులు - స్వాతంత్ర్యోద్యమాన్ని రగుల్కొల్పిన సంస్కృతీ విప్లవం జరుగుతున్న రోజులు.

## మహాకవి జననం

తూర్పు బలబల తెల్లవారెను
తోకచుక్కయు వేగుచుక్కయు
ఒడయుడౌ వేవెల్గు కొలువుకు
వెడలమెరసిరి మిన్నువీధిని

---

* 1857 నం. తిరుగుబాటు.

వెలుగునీటను గ్రుంకె చుక్కలు;
చదల చీకటి కదలబారెను;
యెక్కడనొ ఒక చెట్టుమాటున;
నొక్కకోకిల పలుకసాగెను.

మేలుకొలుపులు కోడికూసెను;
విరులు కన్నులు విచ్చిచూసెను;
ఉండి, ఉడిగియు, ఆకులాడగ;
కొసరెనోయన గాలివీచెను.

('ముత్యాలసరములు')

ఆ రోజులలోనే * తెలుగు సాహిత్యానికి వెలుగుచూపిన మహాకవి గురుజాడ వెంకట అప్పారావుగారు విశాఖజిల్లా ఎలమంచిలి తాలూకా రాయవరం గ్రామంలో మాతామహులయింట నియోగి బ్రాహ్మణ కుటుంబములో జన్మించేరు. తండ్రి వెంకటరామదాసుగారు; తల్లి కౌసల్యమ్మగారు. తల్లిదండ్రు లిద్దరు సనాతనాచార పరాయణులు. వెంకట రామదాసుగారికి సంస్కృతంలో మంచి ప్రవేశముంది. ఆయన విజయనగరం సంస్థానపు పేష్కారుగాను, రెవెన్యూ సూపర్‌వైజరుగాను, ఖిలేదారుగాను పనిచేసి పింఛను పుచ్చుకున్నారు తరవాత విజయనగరం సమీపంలోవున్న 'ఊట గెడ్డ'ను ఆయన బండిలో దాటుతుండగా, హటాత్తుగా ఏరు ముంచుకొని వచ్చింది; అందులో వెంకట రామదాసుగారు చనిపోయేరు.

వెంకట రామదాసుగారు చీపురుపల్లికి బదిలీకావడంచేత అప్పారావు గారు పది సంవత్సరముల వయస్సువచ్చువరకు చీపురుపల్లిలో విద్యాభ్యాసం చేశారు. తరువాత విజయనగరంలో చదువుసాగించి 1886లో బి. ఏ. పట్టభద్రులయ్యేరు.

## విద్యార్థి దశ

హైస్కూలు తరగతులలో వున్నప్పుడే అప్పారావుగారు తమ ఉపాధ్యాయుల్ని ఉద్దేశించి హాస్యంగా శ్లోకాలు రచిస్తుండేవారు.

* దుందుభినామ సంవత్సర భాద్రపద శుద్ధ త్రయోదశి ఆదివారం అనగా 1861వ సంవత్సరం నవంబరు 30వ తేదీని, జన్మించారు.

విజయనగరంలో చదువుతున్నప్పుడు అప్పారావుగారి ప్రతిభను కళాశాల ప్రిన్సిపాలు చంద్రశేఖరశాస్త్రిగారు గమనించి ప్రోత్సాహించేవారు. కొన్నాళ్ళు అప్పారావుగారు చంద్రశేఖరశాస్త్రిగారి యింట్లో బసచేసి చదువుకున్నారు.

చదువుకుంటున్న రోజుల్లో అప్పారావుగారూ ఆయనతమ్ముడు శ్యామలరావుగారూ విజయనగరంనుండి వెలువడే 'ఇండియన్ లీజర్ అవర్' [1] అన్న పత్రికలో ఇంగ్లీషుపద్యాలు ప్రచురించేవారు. 'ఇండియన్ లీజర్ అవర్'లో ప్రచురింపబడ్డ అప్పారావుగారి పద్యకావ్యమైన 'సారంగధర'ను సంపాదకులు గుండుకుర్తి వెంకటరమణయ్యగారు, 'రీస్ అండ్ రయ్యత్' [2] పత్రికకు పునఃప్రచురణార్థం పంపేరు. 'సారంగధర', 'చంద్రహాస' అన్నవి అప్పారావుగారి పెద్ద ఇంగ్లీషురచనలు. ఒకొక్కటీ ఐదువందల పంక్తులవరకూ వుంటాయి.

'రీస్ అండ్ రయ్యత్' పత్రికా సంపాదకులైన శంభు చంద్రముఖర్జీ గారు "ఆరోజుల్లో ఆంగ్లరచనకు ప్రసిద్ధిపొందిన పురుషులు....మన ఆంధ్రులలో శ్రీ రావుసాహెబు గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారివలె స్వయంకృషివల్ల నికటమైన పాండిత్యమును సంపాదించినవారు....ఆయన పత్రికలో విమర్శఅంటే గవర్నరు జనరలుకూడా భయపడేవాడు" [3]

ముఖర్జీగారు వెంకటరమణయ్యగారికి 1883 ఆగష్టు 14 న వ్రాసిన ఉత్తరంలో 'సారంగధర' కావ్యాన్ని చాలా ప్రశంసించి కవిని అన్నివిధాలా ప్రోత్సహించడానికి కుతూహల పడుతున్నామని రాశారు; కవిపేరు ('సారంగధర'. కవిపేరు లేకుండానే ప్రచురణార్థం పంపబడింది) చదువు, మొదలైన అన్నివివరాలు అడిగేరు.[4]

తరువాత ముఖర్జీగారికి అప్పారావుగారికి ఉత్తర ప్రత్యుత్తరాలు తరుచుగా జరుగుతుండేవి. ఆయన అప్పారావుగారి ఉపజ్ఞను గమనించేరు. శంభు చంద్రముఖర్జీగారు అప్పారావుగారిపట్ల యెంతో మమకారంచూపి ప్రోత్సాహపర్చేవారు.

---

1 'Indian leisure hour'

2 రాజు, రైతు

3 చూ. గురజాడ అప్పారావుగారి డైరీలు—డాక్టరు బుర్రా శేషగిరిరావుగారు.

4 చూ. 142 వ పుట—Below 'An Indian journalist' by F. H. skrine I. C. S.

"దేశ శ్రేయస్సుకోసరమూ, ప్రపంచ శ్రేయస్సుకోసరమూ పాటు పడడానికి బలమైన యిచ్ఛా బాధ్యతలు గలవారు.........అమితమైన కష్టాలు పడడానికి సిద్ధపడాలి." •

"మీరు రాద్దామనుకున్న రాజకీయ పద్యకావ్యాన్ని ప్రారంభించారా? జానపదగేయాలు, వివిధ ఛందస్సులలో పద్యాలు రాయడానికి ప్రయత్నించండి" •

శంభుచంద్ర ముఖర్జీగారి ఉత్తరాల్లోని పైనుదహరింపబడిన రెండు భాగాలూ, విద్యార్థిదశలో అప్పారావుగారి ఆశయాల్ని, అభిరుచుల్ని కొంత వరకూ వ్యక్తంచేస్తాయి.

ఈ వుత్తరాలు 1884 సం న రాసినవి. అంటే కాంగ్రెసు పుట్టుకకు ఒక సంవత్సరం పూర్వానివన్నమాట. ఆనాటి భారతీయ మేధావుల్ని జాతీయభావాలు యెలాగ ఆకర్షిస్తున్నాయో యీ వుత్తరాలనుబట్టి మనం కొంతవరకు తెలుసుకోవచ్చు.

ఆ జాతీయభావాలే అప్పారాయ మహాకవిని ఆకర్షించి, దేశాభిమానినిగాచేసి రాజకీయ పద్యకావ్య రచనకు సంకల్పించుకున్నట్టు చేశాయి. కాని యీ రచన సాగినట్టు కనిపించదు. ఈ భావపరిణామమే అప్పారావుగారి వ్యక్తిత్వాన్ని నిర్మించి మన నవ్యసాహిత్యానికి శకస్థాపకుణ్ని ప్రసాదించింది.

అప్పారావుగారిలాగే ఆయన తమ్ముడు శ్యామలరావుగారు దేశాభిమానియైన ప్రతిభాశాలి; లాకాలేజీలో చదువుతూ అకాలమృతి చెందారు. కాంగ్రెసు నిర్మాతలూ, ఆనాడు బ్రిటిష్‌ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించే సుప్రసిద్ధులూ అయిన హ్యూము, డబ్ల్యు. సి. బెనర్జీ, నార్టన్‌గార్ల మీద ఇంగ్లీషులో పద్యాలు 1 వ్రాసి 'హిందూ' 2 పత్రికలో శ్యామలరావుగారు ప్రచురించేరు.

---

• 1884 జనవరి 27 నాడు వ్రాసిన ఉత్తరం చూ. 151వ పుట 'An Indian Journalist'

• 1884 జూన్ 22 నాడు వ్రాసిన ఉత్తరం చూ. 151వ పుట.

1. 'To the Magnificient Seditionists'
2. 'The Hindu' Madras.

## లెక్చరరు పదవి

అప్పారావుగారు విజయనగరం కళాశాలలో 1886 సం.న పట్టభద్రులయ్యేరు. ఫిలాసఫీ అభిమానశాస్త్రంగాను, సంస్కృతం రెండవ భాషగాను బి. ఏ. ప్యాసయ్యేరు. పట్టభద్రులు కాకపూర్వమే 1884 ఏప్రిల్ మాసంలో విజయనగరం కళాశాలా ఉపాధ్యాయులుగా నియమింపబడ్డారు. తరువాత యీ ఉద్యోగానికి సెలవుపెట్టి 1887 ఏప్రిలులో విజయనగరం జనరల్ డ్యూటీ డిప్యూటీ కలెక్టరాఫీసులో సబ్స్టిటం హెడ్ క్లార్కుగా చేరేరు. "కాలేజీ జీతం రు. 25/- అవడంచేతనూ, గవర్నమెంటు యుద్యోగంలో అప్పుడు పట్టభద్రులకు పెద్ద అవకాశాలుండడంచేతనూ కాబోలు, ఆయన యీమార్పు తలపెట్టాడు" *.

తరువాత అప్పారావుగారు, కొద్దినెలలు మాత్రం కలక్టరాఫీసు ఉద్యోగంచేసి, 1887 విజయదశమినాడు (అక్టోబరు ప్రాంతం) 100 రూ. జీతంతో విజయనగరం కళాశాలలో నాలుగవ లెక్చరరుగా ప్రవేశించేరు. నాలుగు సంవత్సరాలతరువాత, 1891లో 125 రు. జీతంతో మూడవలెక్చరరు అయ్యేరు. ఇంగ్లీషు, వ్యాకరణం, సంస్కృతసారస్వతం, తర్జుమా, గ్రీకు, రోమనుచరిత్రలు, బి ఏ., యఫ్ ఏ. క్లాసులకు పాఠాలు చెప్పేవారు.

అప్పారావు మహాకవికి ఆనాటి పౌరహితకార్యకలాపాల్లో యెక్కువ ఆసక్తివుండేది. చెన్నరాష్ట్రంలోని ప్రముఖులతోను, రాష్ట్రేతర ప్రముఖులతోను ఆయన నడిపిన ఉత్తరప్రత్యుత్తరాలలో యిది ద్యోతకమవుతుంది. 'తెలుగుహార్పు'లో ఆయావిషయాలమీద సంపాదకీయవ్యాసాలు రాసేవారు. కస్పావీధి రేట్ పేయర్సు అసోసియేషన్ అధ్యక్షులుగాను, మ్యునిసిపల్ కౌన్సిలరుగాను స్థానికవిషయాలలో శ్రద్ధతీసుకునేవారు.

అప్పారావుగారి గురువులూ, ఆయన ప్రతిభను గుర్తించి ప్రోత్సాహించినవారూ, విజయనగర కళాశాల మొదటి ప్రిన్సిపాలుగావుండి ప్రముఖ విద్యావేత్తగా పేరుపొందిన చంద్రశేఖరశాస్త్రిగారే, అప్పారావుగారు లెక్చరరుగా నియమింపబడడానికి కారణమై వుండాలి. నియామకం గురించి తమడైరీలో రాస్తూ ఆనందగజపతికి మహారాజుకు, చంద్రశేఖర శాస్త్రిగారికి కృతజ్ఞత వెల్లడించేరు.

---

* 'ముత్యాలసరాలు' — రెండవకూర్పులో కిళాంబి రంగాచారిగారు.

కాలేజీలో లెక్చరరుగా పనిచేస్తున్నప్పుడే అప్పారావుగారికి ఆనంద గజపతి మహారాజుతో పరిచయమైంది. కళా పక్షపాతి అయిన ఆ మహారాజును అప్పారావుగారి ప్రతిభ ఆకర్షించింది. ఆనాటినుంచి ఆయన జీవితాంతంవరకూ అప్పారావుగారు మహారాజుకు పరమమిత్రులైన అంతరంగికు లయ్యేరు.

ఆనంద గజపతి మహారాజు సన్నిధానంలో, మన తెలుగుదేశంలో వన్నెకెక్కిన విద్వాంసులూ, కళావేత్తలూ వుండేవారు. ఆయన నిరంతరమూ విద్యావ్యాసంగంలో లీనమై ఉండేవారు. అటువంటి విద్యాధికులలో అప్పారావుగారు తమ యిరవై యెనిదవయేటనే, అంటే 1889 అగష్టు 16 తేదీని, విజయనగరాస్థానపు డిబేటింగు క్లబ్బుకు ఉపాధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. దీనినిబట్టి అప్పారాయ మహాకవి చిన్నవయసుననే అభినవ కృష్ణరాయులని పేరుపొందిన ఆనందగజపతి మహరాజు ఆస్థానంలో ఎన్నిక కెక్కేరని మనమూహించుకోవచ్చు.

లెక్చరరుగా వున్నప్పుడు తాము బోధించే విషయాల్లో కూలంకషమైన ప్రజ్ఞ సంపాదించడమే కాకుండా, చెన్నపట్నం, బెంగుళూరువంటి పట్టణాలకు వెళ్ళినప్పుడు అక్కడి అధ్యాపకులు బోధించేతీరులు జాగ్రత్తగా పరిశీలించేవారు. ఆ ప్రొఫెసర్లతో విద్యావిషయకమైన దీర్ఘచర్చలు చేసేవారు. [1] "ఈ సంప్రతింపులలో తమ విజయనగరం కాలేజీలోని పరిస్థితులకూ తాము ఆప్రాంతములలో చూచినవాటికి తేడాలు చూచుకొంటూ, మొత్తముపై విజయనగరంలోని విద్యాపరిస్థితులున్నూ వ్యాసంగమున్నూ, ఆ ప్రాంతమువాటికి తీసిపోవని గ్రహించారు. తమకు అక్కరలేకపోయినా తమతోటి సహోపాధ్యాయులైన విజయనగరం కాలేజీ లెక్చరర్లకు యూనివర్సిటీలో గౌరవము లభించేటట్టు అచ్చటివారితో గట్టిగా చేసిన సిఫారసులను బట్టిచూస్తే, ఆయన ఔదార్యమున్ను విజయనగరమందలి అభిమానమున్ను తేటపడును."

విద్యార్థులకు రావలసిన ముప్పయి అయిదుమార్కులు, తమకు రావలసిన జీతము పరమావధి, కావనీ, విద్యార్థులకూ, విద్యకూ వన్నెతేవడమే అధ్యాపకుని పరమావధని, అప్పారావుగారి మతమైనట్టూ, పై ఉదంతమూ, తాను లెక్చరరుగా నున్నప్పుడు డైరీలలో రాసుకున్న విషయాలూ

---

1 "గురజాడ అప్పారావుగారి డైరీలు"—బుర్రా శేషగిరిరావుగారు

వ్యక్తం చేస్తాయి. అందువల్లనే ఆయన శిష్యులకు ప్రీతిపాత్రులయ్యేరు. సజీవులై వున్న ఆయనశిష్యులు కొందరు యీనాటికి కూడా ఆయనను స్మరిస్తుంటారు.

అప్పారావుగారి ఉద్యోగధర్మ నిర్వహణాన్నీ, జ్ఞానపిపాసను ద్యోతకం చేసే ఒక ఉదంతాన్ని ఉదహరిస్తాను.

"గ్రీకు, రోమను గ్రంధపఠనంవల్ల 'రినేజాన్సు' దినములలో యూరపులో అన్నిరాజ్యములలోనూ స్వదేశీయ సారస్వత విజృంభణము ఒక్కమారు ప్రతిభావంతమైనదికదా! అట్లే ఆంగ్లుల ప్రసిద్ధ సారస్వత ప్రచారంవల్ల అట్టి విజృంభణ మన దేశీయులలో ఆంగ్లమందుగాని, స్వభాషలందుగాని యేలకలుగదాయెను"? అన్న సందేహం అప్పారావుగారిని చాలారోజులనుండీ బాధిస్తుండేది. పత్రికలు, గ్రంథాలు, ఉపన్యాసాలు, నాటకప్రదర్శనలు, పెద్దపెద్ద ప్రొఫెసర్లతో చేసిన చర్చలు—యేవీ అప్పారావుగారికి సమాధానం యివ్వలేకపోయేయి. కొన్నాళ్ళు మధనపడిన తరువాత ఆయనకే సమాధానం స్ఫురించింది. అది:

"ఆంగ్ల సాహిత్య పాఠములలో విద్యార్థులకు శైలి (స్టయిల్) లోను, వస్తువిన్యాసము (ట్రీట్‌మెంటు)లోను బాగోగులు విడదీసి బోధింపకుండుట, విమర్శగా చదువుట నేర్పకుండుట, స్వతంత్రయోచనాశక్తిని పురికొల్పునదిగా బోధనాక్రమముండకపోవుట, రసానుభవమూ, వివేచనా లేకుండుట — యివి కారణములుగా ఆంగ్లసాహిత్య వ్యవసాయము నిష్ఫలమగుచున్నది."

పరిపక్వమైన విమర్శనా కౌశల్యమూ, గాఢమైన దేశభక్తీ లేనివారిని యిట్టి సంశయం బాధించదు. బాధించినా వారికిటువంటి సమాధానం దొరకదు. మన బానిసవిద్యావిధానపు నగ్నస్వరూపం అప్పారాయ మహాకవికి ఆనాడే గోచరమైంది!

1896 జూన్ 5 వ తేదీని లెక్చరర్ పదవినుండి సంస్థానపు శాసన పరిశోధకుడుగా నియమింపబడ్డారు. 'కన్యాశుల్కం' మొదటికూర్పు ఉపోద్ఘాతం 1897 జనవరి 1 వ తేదీని రాసినట్టుంది. పైరెండు తారీఖులబట్టి కన్యాశుల్కం అప్పారావుగారు లెక్చరరుగా వున్నప్పుడే రాసినట్టు స్పష్టమవుతుంది. అచ్చుకావడం ఆయన సంస్థానంలో ఉద్యోగం చేస్తుండగా జరిగింది.

## చారిత్రక పరిశోధన

ఆయనకు చారిత్రక పరిశోధన చాలా యిష్టమైన విషయం. ద్రావిడ భాషా తత్వశాస్త్రంలో ఆయన ప్రవీణుడు. వ్యవహారికభాషకు వ్యతిరేకంగా మద్రాసు విశ్వవిద్యాలయంచేసిన నిర్ణయానికి అసమ్మతి తెలియజేస్తూ అప్పారావుగారు రాసిన విపులమైనవ్యాసం [1] ఆయన భాషాతత్వశాస్త్ర పాండిత్యాన్ని కొంత తెలియజేస్తుంది. [2] కళాశాల పనినుండి విరామం దొరికిన కాలంలో అప్పారావుగారు చారిత్రక పరిశోధన చేస్తుండేవారు.

తొమ్మిది సంవత్సరాలు కాలేజీలో లెక్చరరుగా పనిచేసిన తరువాత, 'అప్పారావుగారిని ఆనందగజపతి మహరాజు 1896 జూన్ 5 న సంస్థానపు శాసనపరిశోధకుడుగా నియమించేరు. తమ్ముడు శ్యామలరావుగారి మృతి అప్పారావుగారిని చాలా ఆందోళనపర్చింది. ఆయన ఆరోగ్యం చెడిపోయింది. అప్పారావుగారికి విశ్రాంతికరంగా ఉండడానికి, ఆనందజగపతి

---

1. చూ. 'Minute of Dissent'

2. "ఆ 1895 సం.లో వ్రాసుకున్న డైరీలో మొదటినెలలోనే శ్రీ మహారాజావారివద్ద గ్రంధములు తమ వాడుకలోవున్నవని రికార్డుచేసుకున్నవాటిలో 'Campbell's 'Telugu Grgmmar' అనే తెలుగు వ్యావహారికభాషా వ్యాకరణం కనబడుతున్నది. కన్నడ నిఘంటువులున్నూ. Brown's Telugu Grammer న్నూ తాను కొనుక్కొనినట్లు రికార్డుచేసినాడు. తమిళులు ఆంధ్రం మాట్లాడేటప్పుడు చేసేమార్పులు రికార్డుచేసి పరిశీలించారు. తమిళదేశంలో త్యాగయ్యగారి తెలుగుపాటలే ప్రచారంలో నుండనేల? అని దీర్ఘ విచారణ చేసినారు. తమిళులు మాట్లాడే తెలుగుభాషలో ఆంధ్రపదముల అర్థముల మార్పులు కొన్ని కనిపెట్టి వ్రాసుకున్నారు. ఒకేభాష వివిధప్రాంతములలో యెట్టిఉచ్చారణ భేదములు పొందుతూవుండునో పరిశీలించి ఆ సూత్రముల ననుసరించి 'ప్రాచీన ద్రావిడము' అనేది ఆంధ్ర,కర్ణాట,తమిళ, మళయాళములుగా విభాగిల్లిన మార్గములని నిరూపించ దలచినారు. అప్పటికే శబ్దశాస్త్రములోకూడ ఆయనకు ప్రవీణతవున్నట్లు చెన్నపురి పెద్దలు గమనించిరని యీడైరీలలోని ఒక చిన్న సంభాషణ సూచికవల్ల తెలుస్తుంది:

మే 4 వ తేదీ శనివారం : "క్లబ్బులో కూరెళ్ళ సుబ్బారాయుడు కొడుకు వెంకటలింగం కనబడ్డాడు. ద్రావిడభాషాశబ్దశాస్త్రము (Dravadian phylology) ను గురించి అడిగితే కెల్లెటుగారు నన్నుగురించి ప్రశంసావాక్యములుచెబుతూ నావద్దకువెళ్ళి తెలుసుకోమన్నారని చెప్పినాడు. అయ్యా! తమరు దయచేస్తే నేను రోజూ క్లబ్బుకువస్తానని అతడన్నాడు. ఈ చెన్నపట్నములో వాళ్లు చాలా వింత మనుష్యులు."

చూ. "గురుజాడ అప్పారావుగారి డైరీలు"

మహారాజు ఆయనను లెక్చరరు పదవినుండి శాసన పరిశోధకునిగా నియమించేరు.

విజయనగర సంస్థానాధీశ్వరులైన పూసపాటివారి వంశచరిత్రను సమగ్రంగా రాయడానికి అప్పారావుగారు చాల శ్రమించి పరిశోధనచేసేరు. మాడుగులుమత్స్య వంశంవారి చరిత్ర, విశాఖజిల్లాలోని చాణుక్యుల చరిత్రా పరిశోధనచేసి, చాలా కొత్తవిషయాలు కనిపెట్టారు.

[1] "విజయనగరం సంస్థానం చరిత్ర రాయడానికి తగిన భోగట్టా అంతా సంపాదించారుగాని, దాన్నంతా ఒకచో కూర్చి వ్రాయడానికి ఆయనకు అవకాశం లేకపోయిందనే అనుకోవాలి. రెండుసంవత్సరాలుగడువు ఆపనికై కోరాడు. అది కుదిరిందికాదు. ఈ విషయాలన్నీ యథాస్తు రూపంగా, పుస్తకాల అంచుల్లో టిప్పణీలక్రింద, చెల్లాచెదరై, సూత్రంలేని విడిపూసలక్రింద విరజల్లబడినట్టు ఉన్నాయి. సూత్రంవాని బుద్ధిలోనే యుండిపోయింది. వాని మిత్రుడు శ్రీ గిడుగు రామమూర్తిపంతులు వీనిని సమకూర్చడానికి ప్రయత్నించాడు[2]గాని, ఆయనకు అవకాశం చిక్కినట్లు కనిపించదు. పూసపాటి గజపతుల చరిత్రగాని, విశాఖజిల్లా చాణుక్యుల చరిత్రగాని చిట్టచివరకు ఆయన వ్రాయలేదు."

కళింగదేశ చరిత్రను రాయడానికి అప్పారావుగారు చాల విషయాల్ని సేకరించేరు. కాని ప్రచురణకర్తలైన విజ్ఞానచంద్రికామండలివారు ఆగ్రంథం గ్రాంధికభాషలోనే వుండాలనీ, అప్పారావుగారు వ్యవహారికభాషలో తప్ప రాయననీ, పట్టుపట్టడంవల్ల, పై వాటివలెనే కళింగ దేశచరిత్రకూడా మనసులోనే మరుగుపడిపోయిన మహాకవి భావసంపదలాగా యీనాటికీ చిత్తుప్రతిగానే వుండిపోయింది. ఇదికూడా సూత్రంలేని విడిపూసలుగా విరజల్లబడివుంది.

ఈచరిత్రలిలాగవుండగా దురదృష్టవశాత్తు ఆనందగజపతిమహారాజు కీర్తిశేషులవడంచేత సంస్థానపు వారసత్వపుదావాలో 1897 నుండి 1912 వరకు అప్పారావుగారు తలమునుకలుగా వుండిపోవలసి వచ్చింది. పదిహేను సంవత్సరాలలో అప్పారాయమహాకవి చారిత్రకపరిశోధనకు, సాహిత్యవ్యాసంగాలకూ పెద్దఆటంకాన్నికలిగించి, యీ వారసత్వపు దావా తెలుగుజాతికి రావలసిన మహదైశ్వర్యాన్ని రాకుండాచేసింది.

---

(1) ముత్యాలసరాలు, రెండవకూర్పులో కిళాంబి రంగాచారిగారు
(2) అప్పారావుగారి మరణానంతరం

యుద్ధమల్లుని శాసనప్రాచీనతనుగురించి జరిపినచర్చ ఆయనప్రతిభను సూచిస్తుంది. నవ్యాంధ్రవాగనుశాసనుడైన గిడుగు రామమూర్తిగారికి పరిశోధనలో అభిరుచి కలిగించినవారు వారి బాల్యస్నేహితులైన అప్పారావుగారే।

శాసనపరిశోధకుడుగా అప్పారావుగారుచేసిన కృషికి ఆనందగజపతి మహారాజు 2,350 రూపాయిలు పారితోషికం యిచ్చేరు.

## ఆనందగజపతిమహారాజు

1897 వ సం. లో ఆనందగజపతి మహారాజు కీర్తిశేషులయ్యేరు. ఇది అప్పారావుగారికి తీరని కష్టంగలిగించింది. తమడైరీలో అప్పారావు గారిలా రాసుకున్నారు:

"శ్రీవారి శీలమూ, వ్యక్తిన్నీ చాలా పరిణితిపొందిన వారిమనస్సుల నాకర్షించి నిష్కల్మషమైన సాత్వికముచేతను, మనఃపూర్వకమైన దయ చేతను, దైవికమగు సత్యముచేతను, అట్టివారిఅవాజ్యమైనభక్తి నరికట్టినవి. మా జీవితములు వారి జీవితములో అల్లుకుపోయినవి .... .... ప్రపంచము నుండి యొకజ్యోతి వెడలిపోయినది."

"కన్యాశుల్కం" కృతిసమర్పణంలో ఆనందగజపతిమహారాజు గురించి అప్పారావుగారు ఈక్రింద వ్రాసినది అతిశయోక్తికాదు.

"....జ్ఞానసముపార్జనం వ్యసనంగాగలవాడు. ఆయన సారస్వతానికి చేసిన ప్రశంసాయుతమైన ప్రోత్సాహం సారస్వతసార్వభౌముల్ని ఆయన ఆస్థానికి ఆకర్షించి, తెలుగు సారస్వత చరిత్రలో ఒక ఉజ్వల శకాన్ని ప్రారంభించింది."

కొల్లూరు కామశాస్త్రులు, పేరి వెంకటశాస్త్రులు, మండా చిట్టికామ శాస్త్రులు, భగవత్యవి ముడుంబై నరసింహాచార్యస్వామి, మైసూరు భీమా చార్యులు, "ఆంధ్రకవిజీవితములు" రాసిన గురుజాడ శ్రీరామమూర్తి గార్లవంటి ప్రఖ్యాత విద్వాంసులు; ప్రిన్సిపాల్ కిళాంబి రామానుజా చార్యులు, కోడుభాషకు వ్యాకరణాన్ని సృష్టించిన లింగం లక్ష్మీజీపండితుడు, విష్ణల రామస్వామిశర్మ, గురజాడ అప్పారావుగార్లవంటి ఆంగ్లాంధ్ర సంస్కృతభాషాకోవిదులు; దూర్వాసుల సూర్యనారాయణశాస్త్రి. గురాచార్య వెంకటరమణదాసు, కర్రి పద్మనాభస్వామి, కలిగొట్ల కామరాజు, మతము

రాయాచార్యులు, కవిరాయుని వెంకటరమణయ్య, మహబత్‌ఖాన్, మన్వర్ ఖాన్, అబిదుల్లాఖాన్, నిషావల్లీఖాన్‌గార్లవంటి సుప్రసిద్ధ సంగీత శాస్త్రజ్ఞులు ఆనందగజపతి మహారాజుసభ నలంకరించిన ఉజ్వల నక్షత్రాలు.

"ఆనందగజపతి మహారాజుకు సాహిత్యాది కళాగోష్ఠి అక్షరాలా వ్యసనమైవుండేది. "ప్రభువు రాజ్యభారము మాతృశ్రీవారికినీ, మేనేజర్లకును ఒప్పగించి, నిత్యము సంగీత సాహిత్య విద్యావినోదములచేతనే కాలము గడుపుచువచ్చెను. ప్రతిదినము సాయంకాలము పండితసభ రాజ మహాలులో జరుగుచుండెను." *

1910, 1911 ఉగాది సంచికలలో కొంతభాగం ప్రచురింపబడి అసంపూర్ణంగా నిలచిపోయిన 'బిల్హాణీయం' అన్న అప్పారావుగారి నాటకంలో, ఆనందగజపతి దర్బారు విశేషాలు, ఆకాలపు విజయనగర సంస్థానంలోని ప్రధానపురుషుల పోలికలూ చాల కనిపిస్తున్నాయని అప్పారావుగారి శిష్యులైన డాక్టరు బుర్రా శేషగిరిరావుగారు అభిప్రాయపడుతున్నారు.†

పైని పేర్కొనబడ్డ విద్యావ్యాసంగాలే కాకండా ఆనందగజపతి మహారాజు ఆదరణకింద నాటకసమాజం ఒకటి వుండేది. సంస్కృతాంధ్రాంగ్ల నాటకాలాడేవారు. నటులు సాహిత్యంగలవారు. మొట్టమొదట 'కన్యాశుల్కా'న్ని యీ నాటకసమాజమే ప్రదర్శించింది.

ఆయన పోషకత్వంలో 'తెలుగుహార్పు' అన్న ఆంధ్రాంగ్లపత్రిక ప్రచురింపబడేది. అప్పారావుగారు మొదలైన ప్రముఖులరచనలు అందులో వెలువడేవి. 'తెలుగుహార్పు' వ్యవహారికాంధ్రానికి స్థానంయిచ్చిన మొట్టమొదటి పత్రిక.

ఈ 'విద్యాభోజుడు' విజయనగరం కళాశాలను విశ్వవిద్యాలయంగా చెయ్యడానికి ప్రయత్నించేరు. కాని నెరవేరలేదు.

ఆనందగజపతి మహారాజు బ్రతికివున్నంతకాలం సర్వకాల సర్వావస్థల్లో అప్పారావుగారిది సారస్వత జీవితమనే చెప్పాలి. సర్వసాధారణంగా అప్పారావుగారిపడకకూడా కోటలోనే. ఉదయం కోటలోకివెళ్లితే యెప్పుడో రాత్రివేళ యింటికి వచ్చేవారు. భోజనం, అల్పాహారాదులు అక్కడేజరిగేవి.

---

* 'ఆనందగజపతి విద్యావినోదములు' — ఆంధ్రపత్రిక తారణ సంవత్సరాది సంచికలో అడిదము రామారావుగారు.

† చూ. 'అప్పారావుగారి డైరీలు'

ఇంగ్లీషుమోజు అపరిమితంగావున్న ఆరోజుల్లో మహారాజుగారు అప్పారావుగార్ని ప్రోత్సహించి, ఆయన తెలుగురచనలు చేయడానికి కొంతవరకు కారణభూతులయ్యేరని వినికిడివుంది. సంస్కృత పద్య రచనకంటె తెలుగుపద్యరచన కష్టతరమైనదని అప్పుడు అప్పారావుగారు భావించేరట. సులభశైలికోసరం అప్పారావుగారు కంకణం కట్టుకొని నిలవడం యిందువల్లనే జరిగి వుండవచ్చు.

కన్యాశుల్క వివాహాల లెక్కలు సంగ్రహించడానికి ఆనందగజపతి మహారాజు 'కన్యాశుల్కం' రచనకు పదేళ్ళకుపూర్వం—సుమారు 1886-87 సం. మధ్య — ఏర్పాటుచేసేరు. అప్పారాయ మహాకవితోవున్న సన్ని హిత సంబంధంబట్టిచూస్తే, ఆయనను మహారాజు కన్యాశుల్కం రాయ డానికి ప్రోత్సహించి వుండవచ్చు. ఆంధ్రసాహిత్యంలో నూతనశకాన్ని స్థాపించిన ఆకావ్యానికి కృతిభర్తయై ధన్యులయ్యేరు కృతులు రచింపించి గణుతికెక్కిన కవిరాజు.

పండితుడు, కవి, సంగీతాది కళాకుశలుడు, బహుభాషాకోవిదుడు. కళాపోషకుడు, ఆనందగజపతి మహారాజు. పురాణప్రబంధయుగాలు రాజ రాజనరేంద్ర, కృష్ణరాయల ఆదరాభిమానాలవల్ల ప్రారంభమైనట్టే, నవ్యాంధ్ర సాహిత్యయుగానికి ఆనందగజపతి మహారాజు ఆదరాభిమానాలుండేవి. ఆనందగజపతి మహారాజు అకాలమృతివల్ల తెలుగు సారస్వ తానికి తీరనినష్టం కలిగింది. పరిపక్వమై, ఆంధ్రసంస్కృతికి పెన్నిధులను సమకూర్చగల అప్పారావుగారి అమూల్యజీవితంలో సుమారు పదిహేను సంవత్సరాలకాలం, మహారాజు తదనంతరంవచ్చిన వారసత్వం దావాలో వ్యయపడి తెలుగు సారస్వతానికి తీరవినష్టం కలిగింది.

అయినా వీలుచిక్కినప్పుడు సారస్వత వ్యాసంగాన్ని అప్పారాయ మహాకవి చెయ్యక మానేవారుకాదు.

మహారాజు కీర్తిశేషులవడంవల్ల అప్పారావుగారు 1898 లో శాసన పరిశోధకుని (ఎపిగ్రఫిస్టు) పనినుండి, మహారాజుసోదరి రీవా మహారాణి అప్పలకొండయాంబగారికి కార్యదర్శిగా బదిలీ అయ్యేరు.

## దేశభక్తి

ఇక్కడ కొంచం ఆగి, అప్పారావుగారు మహాకవీ, మహాపురుషుడు కావడానికి సహాయపడ్డ ఆనాటి భౌతికపరిస్థితులను సింహావలోకనం చెయ్యవలసి వుంది.

'సిపాయిల తిరుగుబాటు' [1] బ్రిటిష్ ప్రభుత్వపు పిడికిలినుండి తప్పించుకోడానికి భారతీయులుచేసిన పెద్ద ప్రయత్నాలలో ఆఖరుది. అప్పటికి వేళ్లు తన్నుకపోయిన బ్రిటిషుసామ్రాజ్య మహావృక్షాన్ని కదల్చివేసింది. కాని పెకలించి వెయ్యలేకపోయింది. 'తిరుగుబాటు' అణచివేయబడింది. కాని భారత స్వాతంత్ర్య కాంక్ష అణగారిపోలేదు.

మహాకవి 1861 సం. లో—అంటే 'తిరుగుబాటు' విఫలమైన నాలుగేళ్ళ తరవాత—జన్మించేడు.

[2] సామ్రాజ్యతత్వ దోపిడీవిధానం భారతదేశపు మూలుగులు పీల్చుకుంటూంది. దేశం నాలుగుమూలలా కరువుకాటకాలు దావానలంలాగ వ్యాపిస్తున్నాయి. అంతవరకూ నివురుకప్పిన నిప్పుగా పడివున్న అసంతృప్తి, అశాంతి జ్వాలలు ప్రభుత్వాన్ని ఆవరించుకుంటున్నాయి. అక్కడక్కడ ప్రభుత్వంమీద తిరుగుబాట్లు ప్రారంభమయ్యాయి. బ్రిటిష్ ప్రభుత్వాన్ని పెద్ద దెబ్బతియ్యడానికి లోలోపల ప్రయత్నాలు జరుగుతున్నాయి. పండువంటి భారతదేశం చేజారిపోయే పరిస్థితులేర్పడుతున్నాయి. బ్రిటిష్ ప్రభుత్వం మేలుకొంది. తన రాజనీతి తంత్రజ్ఞతను ప్రదర్శించింది. తీవ్రత చెందుతూన్న జాతీయ భావాలను బుజ్జగించి జోకొట్టడానికి పూనుకుంది. బ్రిటిష్ ప్రభుత్వం భారతీయులకు ఆశలుచూపింది. ప్రభుత్వ నిర్వహణలో భారతీయులకు భాగం యిస్తాననంది. మితవాద దృక్పథంగల భారతీయమేధావులు కాంగ్రెసుసంస్థను [3] నిర్మించడానికి ప్రోత్సహించింది. స్వాతంత్ర్య భావప్రవాహం శాసనబద్ధమైన ఆందోళనా పద్ధతులవైపు మళ్ళింది.

భారతీయ మేధావులలో బాగా రాజకీయభావసంచలనం జరుగుతున్న ఆపరిస్థితులు యువకుడైన అప్పారాయమహాకవిమీదకూడా తమ ప్రభావాన్ని

---

1. 1857 వ సం॥
2. చూ. 'నేటిభారతదేశం' శీర్షికలలో 'భారతజాతీయోద్యమం.' పామీదత్తు.
3. 1885 లో కాంగ్రెసు పుట్టుక.

చూపెట్టేయి. శంభుచంద్రముఖర్జీగారు అప్పారావుగారికి రాసిన ఉత్తరాలు * యీవిషయాన్ని స్పష్టపరుస్తాయి. స్వాతంత్ర్యభావాలు అప్పారావుగారిని రాజకీయ పద్యకావ్యాన్ని రాయడానికి ప్రేరేపించినట్టు ఆ ఉత్తరాలు వ్యక్త పరుస్తున్నాయి.

1887 అక్టోబరు 27 డైరీలో తాను స్థానికంగా జరిగిన కాంగ్రెసు మీటింగులో ఉపన్యసించినట్టువుంది. ఆరోజుల్లో కాంగ్రెసు సభలు విజయ నగరంలో జరుగుతున్నట్టూ, వాటిలో కళాశాల ఉపాధ్యాయులు ఉపన్యాసా లిస్తున్నట్టూ, 'తెలుగుహార్పు'లో ఆ వార్తలు పడుతున్నట్టూ అప్పారావు గారి డైరీలవల్ల మనకు తెలుస్తుంది.

'కొండుభట్టీయం' 'కన్యాశుల్కా'లలో జాతీయోద్యమం విషయా లక్కడక్కడ కనిపిస్తాయి.

'గిరీశం' వెంకటేశాన్ని సురేంద్రనాథబెనర్జీ అంతటివాణ్ని చేసే స్తానని టప్పాలుకొడతాడు — బండివాడికి కాంగ్రెసునుగురించి దీర్ఘోప న్యాసం చేసేక, రామాయణం అంతావిని రాముడికి సీతేమవుతుందన్నట్టు, కాంగ్రెసువారు వాళ్ళవూరు పోలీసువాణ్ణి ఎప్పుడు బదిలీచేస్తారో చెప్ప మని అడుగుతాడు — † 'ది ఎలవెన్ కాజెస్ ఫర్ ది డిజనరేషన్ ఆఫ్ ఇండియా' అన్న విషయంమీద బ్రహ్మాండమైన ఉపన్యాసం తాను పూనాలో యిచ్చినట్టు గిరీశం చెప్పుకుంటాడు — 'కొండుభట్టీయం' లో మంజువాణి యింట్లో బంగారాన్ని సంగ్రహించడానికి బయలుదేరుతున్న కొండిభట్లు యేదో కేకవిని 'వందేమాతరం గుంటడి' నినాదమేమోనని అనుకుంటాడు.

1910 వ సంవత్సరానికి పూర్వం — అంటే 'ముత్యాలసరాల కూర్పుకు పూర్వం — రాసిన యీ రెండు నాటకాలలో వెలువడిన జాతీయ భావాలు సంస్కారాశయాలు ముత్యాలసరాలలో పరిణితి చెందేయి.

మితవాదధోరణిలోవున్న రాజకీయాలు రానురాను తీవ్రత చెందు తున్నాయి. సామ్రాజ్యవాదుల దుశ్చేష్టితాలు మేధావులతోబాటు ప్రజలకు కూడా వెగటుకలిగిస్తున్నాయి. స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం అన్న నినా దాలు ప్రపంచమంతటా మారుమోగుతున్నాయి. వంగరాష్ట్రవిభజనం భారత దేశమందంతటా బ్రిటిష్‌వ్యతిరేకోద్యమానికి ఒక కొత్తరూపాన్నిచ్చింది.

---

* 1884 జనవరి 27; 1884 జూన్ 22 తేదీల ఉత్తరాలు.

† The Eleven Causes for the Degenaration of India

జాతీయోద్యమానికి ప్రభుత్వంతో బహిరంగంగా సంఘర్షణ మొద లైంది. ప్రదర్శనాలు, సభలు, హర్తాళాలు ప్రజలు చేయసాగేరు. ప్రభుత్వం నిర్బంధవిధానాన్ని అవలంబించింది. అప్పటివాతావరణాన్ని 'కాంగ్రెసు చరిత్ర' • యీవిధంగా వర్ణిస్తూంది.

"ప్రభుత్వము వారవలంబించిన యీ నిర్బంధ విధానము 1905-1906 లోని జాతీయోద్యమము నణచివేయుటకు బదులుగా 'నగారాను జోకొట్టి' నట్లయినది. ఆనాడెక్కడో ఒకమూలజరిగిన సంగతులు యావ ద్భారతదేశమునకు వెల్లడైనవి. ప్రభుత్వమువారు వంగరాష్ట్రములో నవలం బించిన నిర్బంధవిధాన ఫలితములు దేశమంతటను దృగ్గోచరమైనవి. వంగ రాష్ట్రసమస్య అఖిలభారత సమస్యయైనది. ప్రతి రాష్ట్రమునందలి ప్రజలూ, ఎన్నాళ్ళనుండియో వారి హృదయములలో దాగియున్న అసంతృప్తిని వెల్లడించి. జాతీయాందోళనము నింకను బలవత్తరముగాచేయ ప్రారం భించిరి..... లాలాలజపతిరాయులును, సర్దార్ అజితసింగును ప్రవాసము నకు పంపబడిరి. ఇట్టి తరుణములో కలకత్తా కాంగ్రెసుకు భారతపితా మహుడు దాదాభాయినౌరోజీ అధ్యక్షుడుగా నెన్నుకొనబడుట చాల సమంజ సము. ఆయన స్వరాజ్యము భారతదేశ రాజకీయోద్యమమునకు పరమావధి అనిచెప్పెను."

పాఠశాలా బహిష్కారోద్యమముచే, జాతీయవిద్యా ప్రాముఖ్యాన్ని గుర్తించడం జరిగింది. 1906 కలకత్తా కాంగ్రెసు జాతీయ విద్యావిధానం గురించి తీర్మానంచేసింది. 1907 లో బిపిన్‌చంద్రపాల్‌గారు ఆంధ్రదేశ పర్యటనంచేసి జాతీయాందోళనను రగిల్చేరు. అప్పుడే బందరులో జాతీయ విద్యాలయం స్థాపించబడింది.

అరవిందునివంటి మేధావులు జాతీయోద్యమంలో పాల్గొన్నారు.

అనేకులకు ప్రవాసశిక్షలు, ఉరిశిక్షలు విధింపబడ్డాయి. జాతీయోద్య మంలో దౌర్జన్యపద్ధతులుకూడ పొడచూపేయి. భారతదేశంలోను, ఇంగ్లం డులోకూడ, భారతీయులు రాజకీయహత్యలు చేయసాగేరు.

1908 జులై 13 వ తేదీని బాలగంగాధర తిలక్‌గారు అరెస్టుచేయ బడ్డారు. మనరాష్ట్రంలో ఆనాడే గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారితోబాటు మరియిద్దరు దేశభక్తులు అరెస్టుచేయబడ్డారు.

• భోగరాజు పట్టాభిసీతారామయ్యగారి "కాంగ్రెసు చరిత్ర"

1910 లో వ్రాసిన ముత్యాలసరాలకు యీ పరిస్థితులు చాలా దోహదంచేసి వుండకతప్పదు.

"దేశమును ప్రేమించుమన్నా
మంచిఅన్నది పెంచుమన్నా
వొట్టిమాటలు కట్టిపెట్టోయి
గట్టిమేల్ తలపెట్టవోయి"

అనీ,

"దేశాభిమానం నాకు కద్దని
వొట్టిగొప్పలు చెప్పుకోకోయి;
పూని యేదైనాను వొకమేల్
కూర్చిజనులకు చూపవోయి"

అనీ అప్పారాయమహాకవి ప్రబోధించేరు.

"దేశమంటే మట్టికాదోయి
దేశమంటే మనుషులోయి" ('దేశభక్తి')

దేశం పూజాపునస్కారాలు చెయ్యవలసిన దేవతామూర్తికాదనీ, మనుషులే దేశమనీ, గొంతెత్తిపాడేరు.

"పంజరంబుననున్న కట్లను
పగలదన్నగలేక స్రుక్కితి;
నింగిపర్వగలేని జన్మము
సిరసంబని రోసితిన్" ('లంగరెత్తుము')

పై నుదహరించిన అప్పారాయమహాకవి వాక్యాలమీద జాతీయోద్యమ ప్రభావం స్పష్టంగా కనిపిస్తుంది. ముత్యాలసరాల్లో ఆనాటి రాజకీయ సాంఘిక, సాహిత్య సంస్కారాశయాలు ప్రతిబింబించాయి.

మద్రాసు ఓరియంటల్ డ్రమెటిక్ కంపెనీ అధ్యక్షులూ స్థాపకులూ, ఆనందగజపతి మహారాజా విద్వద్బృందంలో ఒకరూ అయిన జి. సి. వి. శ్రీనివాసాచార్యగారు రచించిన ఇంగ్లీషు హరిశ్చంద్ర నాటకానికి, అప్పారావుగారు వ్రాసిన ఉపోద్ఘాతంలో ఆనాడు జరుగుతున్న సంస్కృతీ విప్లవాన్ని ఆయన యెంతచక్కగా విలువకట్టేరో తెలుస్తుంది. 1897 జనవరి 4 వ తేదీని అప్పారాయ మహాకవి ఉపోద్ఘాతంరాసేరు :

"రాష్ట్రాంతర వార్తా, వ్యవహార నిర్వహణ లో, ఇంగ్లీషుభాష, సంస్కృత, హిందుస్థానీభాషలను త్వరితగతితో స్థానభ్రష్టత్వం కలిగిస్తుంది. అంతేకాకుండా, ప్రతిసంవత్సరం అధికమవుతూన్న విద్యావంతులద్వారా నూతనభారతదేశాన్ని నిర్మించింది. ఈ విద్యావంతులలో పూర్వం జాతీయ భావాలు అనాచరణీయంగాను, అవాస్తవికంగాను వుండేవి. పురాతన భావాలకు నూతనభావాలతో సంపర్కం కలిగినప్పుడు అవశ్యంగా వుత్పన్నమయ్యే ఉత్సాహమూ, నూతన కార్యాచరణాపేక్ష, యిప్పుడు చాలా త్వరత్వరగా పెంపొందుతున్నాయి."

ఆ ఉపోద్ఘాతంలోనే, ఆంగ్లేయులకు భారతీయులకుకూడా హరిశ్చంద్ర నాటకం యెలా పనిజేస్తుందో తెలియచేసేరు :

"హరిశ్చంద్రుని సత్యదీక్ష, సత్యాచరణానికి, సత్యవాక్య పరిపాలనకు తదితర విషయాలన్నిటినీ లోబర్చడమూ, ఆకథారచనకాలంలోని భారత దేశహృదయాన్ని తెలియజేస్తుంది. ఈకథ సహృదయులైన ఆంగ్లేయులకు, భారతదేశ ఆదర్శాల ఉత్కృష్టతను చూపడానికి పనికివస్తుంది. అంతేకాకుండా, విద్యావంతులైన హిందువులలోనూ, వారి పలుకుబడిలోనికి వచ్చిన స్వదేశీయులలోనూ, శతాబ్దాల రాజకీయ బానిసత్వంవల్ల మరుగుపడిపోయిన ఉన్నతభావాలను పెంపొందించడానికి పనికివస్తుంది."

విచక్షణాజ్ఞానంలేకుండా పాశ్చాత్యనాగరికతా ప్రభావంలోపడి, మన ఆదర్శాలను మర్చిపోవడమేకాకుండా, పాశ్చాత్యుల ఆదర్శాలనుకూడా అలవర్చుకోలేని భారతీయులకు, జాతీయవీరులకథలు ఉత్తేజపరచి, దేశాభ్యుదయానికి తోడుపడతాయి ఈ ప్రయోజనమే హరిశ్చంద్రనాటకానికుందని అప్పారాయ మహాకవి అభిప్రాయం.

ఉత్కృష్ట జాతీయభావాలను జీర్ణించుకొన్న ప్రతిభావంతుడు గనుకనే అప్పారావుగారు దేశభక్తియుతమైన ముత్యాలసరాలను రచించగల్గేరు. నవకవులకు "స్వాతంత్ర్యపుటూర్పుపోసిన పరమేష్టి.... దేశభక్తి అంటేఏమిటో మొదట తెలియజెప్పిన మహానుభావుడితడే."[1]

నేటి కవులు ఆంధ్రాభిమానాన్నీ, దేశాభిమానాన్నీ బానిసప్రజల శ్రేయస్సునూ రేకెత్తించే కవిత్వంరాసేరంటే, వారిని ఉద్రేకపర్చిన స్వాతం

1. 'గురజాడ వాల్మీకి'. ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు.

త్ర్యోద్యమంతోపాటు దానికి తోవచూపిన అప్పారాయ మహాకవి చలవే కారణమని నిస్సంశయంగా చెప్పవచ్చు.

స్వాతంత్ర్యపోరాటంలో ఐక్యత ప్రధానపాత్ర వహిస్తుంది. ఈనాటి రాజకీయాలలో ఐక్యతారాహిత్యంవలని దుష్ఫలితాలను విషాదకరమైన ఉదాహరణగా తీసుకోవచ్చు.

"ఓర్వలేమి పిశాచి దేశ-
మూలుగులు పీల్చేసెనోయి.
ఒరుల మేలుకు సంతసిస్తూ
ఐకమత్యం నేర్చవోయి :"

మతసామరస్యం గురించి మహాకవి ప్రబోధం :

"మతం వేరైతేను యేమోయి ?
మనసులొకటై మనుషులుంటే
జాతమన్నది వేచిపెరిగి
లోకమునరాణించునోయి !"

"చెట్టపట్టాల్ పట్టుకుని
దేశస్థులంతా నడవవలెనోయి
అన్నదమ్ములవలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయి." ('దేశభక్తి')

దేశంలో జాతీయోద్యమం అభివృద్ధిఅవుతుంటే ఒకవేపు సంకుచిత దృక్పథాలుకూడా పొడచూపేయి. సంకుచితదృష్టిగల హిందువులుకొందరు దేశానికి తామేవారసులమనీ, యితరులకు దేశంలోహక్కులేదనీ, యీనాటి లాగనే, వాదించేరు. చరిత్రజ్ఞానంతోను దేశభక్తి జనితమైన ఐక్యతా ప్రీతితోను చేసిన మహాకవి హెచ్చరికను వినండి :

"నిన్నవచ్చా రింగిలీషులు
మొన్నవచ్చిరి ముసలమను; లటు
మొన్న వచ్చినవాడ వీవని
మరచి, వేరులుబెట్టకోయి" *

* 'దేశభక్తి' అన్న శీర్షికతో ప్రచురింపబడ్డ గేయాల చిత్తుప్రతిలో యీ గేయంవుంది. ప్రచురింపబడినవాటిలో యిది చేర్చలేదు. మహాకవి స్వహస్త లిఖితంగావున్న యీ చిత్తుప్రతి వేరొకచోట యథాతథంగా ముద్రించబడింది.

మాతృదేశంగా భావించేవారందరికీ సొత్తు భారతదేశం అని ధ్వని.

'దేశమును ప్రేమించుమన్నా' దేశస్వాతంత్ర్యమన్నా దేశసౌభాగ్యమన్నమాట. అందుకే

"యీసురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయి?"

అని మహాకవి ప్రశ్నిస్తున్నారు.

"పాడిపంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటుపడవోయి:
తిండికలిగితె కండకలదోయి
కండకలవాడేను మనిషోయి!"

"దేశమనియెడి దొడ్డవృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయి
నరులచెమటను తడిసి మూలం
ధనం పంటలు పండవల్నోయి!"

ఆ ఆదర్శసిద్ధికి

"మందగించక ముందు అడుగేయి
వెనకపడితే వెనకేనోయి!" అని హెచ్చరిస్తున్నారు.

## సంఘ సంస్కారాశయాలు

ప్రాచ్యపాశ్చాత్యభావాల 'మేలుకలయిక'వల్ల, దేశాభ్యుదయానికి వేరుపురుగులైన సంకుచిత మూఢాచారాలకు వ్యతిరేకంగా దేశమంతటా ఉద్యమాలు ప్రారంభమయ్యేయి. వంగరాష్ట్రంలో ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు, మహారాష్ట్రంలో మహాదేవ గోవిందరెనడే, మన తెలుగువారిలో యుగపురుషుడు వీరేశలింగంవంటి మహాపురుషులు దేశంలో అవతరించారు. సమాజాన్ని పట్టిన వేరుపురుగులను నాశనంచేస్తేనేకాని 'దేశమనియెడి దొడ్డవృక్షం' నిలబడలేదని గ్రహించి సంఘసంస్కారానికి తుపాను లేవదీసేరు.

వర్ణవ్యవస్థ, అంటరాని తనం మొదలైనవి పెనుభూతాలవంటి సమస్యలయ్యేయి. ఈసందర్భంలో అప్పారావుగారి అభిరుచులు, కార్యదీక్ష

యేవిధంగా రూపొందుతూ వచ్చేయో ముత్యాలసరాలపూర్వ కొంత విశద పరుస్తుంది:

"[1]ఒకసారి మనోహరమగు స్త్రీల పాతపాట ఒకటి అప్పారావుగారి చెవినిబడి మనసున క్రొత్తసంగీతము తిరుగగా, తెనుగున ఒక క్రొత్త ఛందము నడిపింపవలెనని సంకల్పముదయించెను. 1910 లో బరంపురమున జరిగిన నానావర్ణ సహపంక్తి భోజనములో అప్పారావు పాల్గొనినాడు. ఆ సంవత్సరమే తోకచుక్క (Halley's comet) పొడిచినది. ఒక విచిత్రమైన భావమథనమున అప్పారావు రసికచిత్తముననుండి ఒక క్రొత్తకవితావేశము రూపుకట్టినది."

తాను జీవిస్తున్న ప్రపంచానికి అతీతుణ్ణికానని మనసారానమ్మే కవిభావన, అతనిచుట్టూరావున్న వాతావరణం ప్రభావం చూపకతప్పదు, నిజమైన కవిభావన ప్రతి చిరుగాలికీ చలించే ఆకువంటిది.

నానావర్ణ సహపంక్తి భోజనంలో పాల్గొని వర్ణవ్యవస్థను ధిక్కరించిన ఆదర్శవాది అప్పారావుగారు:

"ఎల్లలోకములొక్కయిల్లై
వర్ణభేధములెల్ల కల్లై
వేలనెరుగని ప్రేమబంధము
వేడుకలు కురియ"

"మతములన్నియు మాసిపోవును
జ్ఞానమొక్కటి నిలచివెలుగును;
అంతస్వర్గసుఖంబులన్నవి
యవని విలసిల్లున్."

పై రెండుగేయాలు, వర్ణానికీ, మతానికీ, దేశానికీ అతీతమైన జ్ఞానమే శాశ్వతమనీ అది సుస్థాపితమైననాడే 'స్వర్గసుఖంబులన్నవి యవని విలసిల్లు'ననీ అప్పారాయ మహాకవి తమ ఆదర్శప్రీతిని వ్యక్తపర్చుకున్నారు. ఈగేయాలలో విశ్వమానవ సౌభ్రాతృత్వమూ, అంతర్జాతీయతా ప్రబోధింపబడ్డాయి.

1. 'ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము'లో కొంపెల్ల జనార్దనరావుగారు.

మన వర్ణధర్మాల్లోని అక్రమాన్ని విమర్శించేరు మహాకవి. మాలకులం ఎలాగ ఏర్పడింది ?

"మలిన వృత్తుల మాలవారిని
కులములేర్చిన బలియురొక చె
శమున కొందరి వెలికిదోసిరి
మలినమే మాల."

కులంగలవాళ్ళెవరు ?

"కులములేదట ఒక్కవేటున
పసరముల హింసించువారికి;
కులముగలదట నరుల ప్రేచెడి
క్రూర కర్ములకున్."

మనవర్ణధర్మం యెంతధర్మమైనది ?

"మలినదేహుల మాలలనుచును
మలినచిత్తుల కధిక కులముల
నెలవొసంగిన వర్ణధర్మ
మధర్మ ధర్మంబే."

నిజమాలోచిస్తే ?

"మంచిచెడ్డలు మనుజులందున
యెంచిచూడగ, రెండె కులములు"

ఆ 'మంచియన్నది మాలయైతే, మాలనే అగుదున్ !' అని 'లవణ రాజు కల'లో నాయకుని గొంతుకతో మహాకవి తమ ఆశయాలను వెల్లడించారు.

1910 లో తోకచుక్క కనిపించింది. యేదో పెద్దప్రళయం ముంచుకవస్తుందని ప్రజలలో అలజడిపుట్టింది. ఈ మూఢనమ్మకాన్ని అప్పారాయమహాకవి ఎదుర్కొన్నాడు.

"అరుదుగా మిను చప్పరంబున
చొప్పు తెలియని వింతపొడమగ
చన్నకాలపు చిన్నబుద్ధులు
బెదిరి యెంచిరి కీడుగా"

"కవులకల్పన కలిమినెన్నో
వన్నెచిన్నెలు గాంచువస్తువు
లందు వెర్రిపురాణగాథలు
నమ్మజెల్లనె పండితుల్"

లోకమక్కనుగురించి యదార్థాన్ని చెపుతున్నారు :

"దూరబంధువు యితడు భూమికి,
దారిపోవుచు చూడవచ్చెను–
డెబ్బదెనుబదియేండ్ల కొకతరి
నరుల కన్నులపండువై"

తరువాత, తోకచుక్కను చమత్కరించి చెప్పుతున్నారు :

"అంతెకాని రవంతయైనను
వంతనేగతి కూర్చనేర్చునె,
నలువనేరిమి కంతుయిదియన
వింగి తొడవయి వ్రేలుచున్"

"తెగులుఐకిరవని కతలపన్నుచు
దిగులుచెందు టిదేటికార్యము ?
తలతునేనిది సంఘసంస్కర
ణ ప్రయాణ పతాకగాన్"

పాశ్చాత్యభావాల సంపర్కంవల్ల ఆనాడు మొలకలెత్తిన నూతన భావాలులేని రచన ఒక్కటికూడా అప్పారావుగారు చేయలేదని చెప్పవచ్చు. అలాగని మన సంస్కృతినీ, సాంప్రదాయాలను పూర్తిగా తృణీకరించ లేదు. కాలాన్ని అతిక్రమించిన సాంప్రదాయాలను, సంకెళ్ళగా పరిణమించిన సాంప్రదాయాలను మాత్రం తెంచివేసి తెలుగు సాహిత్యానికి నూతన చైతన్యాన్ని, నూతన స్వాతంత్ర్యాన్ని, నూతన వికాసాన్ని ప్రసాదించేరు.

అలాగే పాశ్చాత్యుల సంస్కృతినీ, సాంప్రదాయాలనూ విచక్షణ లేకుండా స్వీకరించలేదు. అప్పారావుగారు స్వీకరించినది పాశ్చాత్యుల నాగరికత — అనాగరకత కాదు.

"తిన్నఁగానని వస్తుతత్త్వము
కాంచనేర్తురు వింగిలీజులు;
కల్లనొల్లరు; పరవిద్యల
కరచి సత్యము నరసితిన్"

చిన్నప్పటి ఇంగ్లీషు భాషావ్యామోహంనుండి మాతృభాషను చేపట్టడం, ఆయన మన సంస్కృతిని త్యజించకపోవడమే కాకుండా గౌరవభావం చూపడానికి ఒక నిదర్శనం. అప్పారాయ మహాకవి మన సంస్కృతికి వంగనామం పెట్టేరని కొందరు భావించడంవల్ల యిదంతా చెప్పవలసివచ్చింది.

ఆయన రచనలు 'కొత్తపాతల మేలుకలయిక' మాత్రమే కాదు; 'కొమ్మెరుంగులు జిమ్మిన ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతుల మేలుకలయిక కూడా అని అప్పారాయమహాకవికి అర్ధశతాబ్దం తరవాతనున్న మనకు స్పష్టపడింది.

వితంతువివాహం, సానిమేళాల్ని బహిష్కరించడం, మతంపేరిట జరుగుతున్న మోసాలు, అంటరానితనం, వర్ణవ్యవస్థలోని అవకతవకలు మొదలైన అనేకసమస్యలను రచనావస్తువులుగాతీసుకొని తెలుగు సాహిత్య భూముల్లో బంగారుపంటలు పండించేరు.

'దిద్దుబాటు' అన్న కథానికలో కథానాయకుడు సానిమేళం మోజు నుంచి తప్పుకోలేక వాటికి హాజరవుతూ, ఎక్కడికివెళ్ళేరని భార్యఅడిగితే మీటింగులకెళ్తున్నాననీ, 'లోకోపకారకరములగు నుద్యమముల నిదుర మాని' చేస్తున్నాననీ అబద్ధాలాడతాడు. కాని మంచివాడు. భార్య అలకను అర్థంచేసుకొని పశ్చాత్తాపపడతాడు. నౌకరును కొట్టినందుకు విచారిస్తాడు. రవ్వారటూలేకుండా తనుచేసిన తప్పును దిద్దుకోవడానికి ఆందోళనపడతాడు. తను రాత్రిళ్ళు సానిమేళానికివెళ్ళడం భార్యకు చెల్లడైపోయి అలిగి పుట్టింటికి వెళ్ళిపోయిందని భ్రమించి బాధపడతాడు, విద్యావంతురాలు, నేర్పరి, భర్తపై మమకారంగల స్త్రీ "కమలిని" తాతలనాటినుండీ యింటిని కనిపెట్టుకునివున్న నౌకరు తీసుకోవలసినచెవు తీసుకొని రాముడు, కమలినిచేసిన 'కుట్ర'లో సహకారంచేస్తాడు. భర్తకు తను చెప్పదలుచుకున్న 'పాఠం' తలకెక్కిందని కనిపెట్టి, రసాభాసంకాకుండా మంచంకిందినుంచి కమలిని బయటికివస్తుంది. దీంతో, పర్యవసానంగురించి ఆతృతగావున్నచదువరిని,

కాథానాయకుణ్ణి ఆశ్చర్యంలోను సంతోషంలోనూ ముంచి కథకుడు కథను సుఖాంతంచేస్తాడు.

'మీపేరేమిటి?' అన్న కథానిక అక్షరాలాసాటిలేనిది. దీన్ని మించిన కథానిక మన సాహిత్యంలో యిప్పటికికూడా పుట్టలేదంటే అతిశయోక్తికాదు

శైవ వైష్ణవమతాల పోటీలలో మోసగాళ్లూ, మతోద్రేకులూచేసే పనులు ప్రజల మనస్సులమీద యెలాగ పనిచేస్తున్నాయో, పూజాపునస్కారాలు దేవుళ్ళ యెలాపుడుతున్నారో యెలాగ పరిణామంచెందుతున్నారో అన్న విషయాలను - ఆయనకు ఆయనేసాటి అన్నట్టుగా - చిత్రించేరు.

అప్పారావుగారు యీకథలో మూడురకాల మనుషుల్ని మనకళ్ళ ముందు నిలబెట్టేరు.

మూఢభక్తి స్వార్థాలవల్ల వచ్చిన పచ్చిమోసాలుచేసే శైవ, వైష్ణవ మతనాయకులు, శరభయ్య - మనవాళ్ళయలు.

"ఏమతమైనా ప్రపత్తివున్నవాడికి తోవవుంది." అదిలేకుండా ఎవడికైనా ఫలితంలేదు - అన్న దృక్పథంగల అయ్యావార్లంగారు, శుద్ధాస్తికులైన గురువుగారు.

మతంపట్ల నవనాగరికులకున్న నిర్లక్ష్యభావంగల రామమూర్తి వెంకయ్యలు.

ఈమూడుపక్షాలను ప్రవేశపెట్టి అప్పారావుగారు అత్యద్భుతమైన కథను అల్లేరు.

మతాధిక్యత నిరూపించుకోవడానికి శైవులూ, వైష్ణవులూచేసే మోటుపనులు, చెప్పే కుయుక్తులూ; మతంపేరిట, డాబుదర్పాలతోను తంత్రాలతోను అమాయకజనాన్ని మతనాయకులుచేసేదగా, యీకథలో అచ్చుతీసి చూపబడింది.

పులిహోరా దద్ధోజనాలమీదిభక్తితో నామాలుపెట్టుకున్న గ్రామంలోని నాయుళ్ళు, ప్రభలు రుంజలు జయగంటలు డమామీలతో శివాచార్లు అట్టహాసంచేసేసరికి, నామాలకు నామంపెట్టి, విభూది రుద్రాక్షధారణం చెయ్యడం ఆరంభిస్తారు.

శివుడూ విష్ణూ పీర్లు అవుతారు. బుద్ధుడు శివుడవుతాడు, పక్కనున్న దేవీవిగ్రహం పార్వతి అవుతుంది.

ఇలాంటివిషయాల నెన్నిటినో యీకథలో పూసగుచ్చినట్టు చెప్పారు. మతపరిణామం యెలాగ వెరితలలుకాసిందో చెప్పారు. ఆ్యండ్లుకే యీ కథానిక ప్రారంభంలో

"దేవుడుచేసిన మనుషుల్లారా!
మనుషులుచేసిన దేవుళ్లారా!
మీపేరేమిటి?"

అని ఒక పెద్దప్రశ్నను విసిరేరు మహాకవి

'లవణరాజుకల'లో కథానాయికుడు 'మంచిచెడ్డలు మనుజులందున ఎంచిచూడగ రెండెకులములు' అన్న విశ్వాసంతో అంటరాని కులానికి చెందిన కన్యను వివాహం చేసుకుంటాడు, నానావర్ణ సహపంక్తి భోజనము గురించి రాయబడిన 'ముత్యాలసరములు' అన్న పద్య కథానికలోకూడా (తోకచుక్క గురించి వున్న మూఢవిశ్వాయాన్నికూడా దీంట్లో వెల్లడి చేసేరు) పైనిచెప్పిన సత్యమే యింకోరూపంలో చిత్రించబడింది.

"కొండుభట్టీయం"లో లౌక్యవృత్తిలోనికిదిగిన వైదీకి కొండిభొట్లు తానెన్నిపాపాలుచేసినా పవిత్రుణ్నే అనుకుంటాడు. ఈయన విధవలను తరింపజేసే భూసురోత్తముడు; వేశ్యావృత్తిలోవున్న మంజువాణికి బేరాలు కుదురుత్తుంటాడు.

"దేవతలు బ్రాహ్మలుచేసేపనులు తప్పుపట్టకూడదు. స్వర్గంలో వాళ్ళు దేముళ్ళయితే, భూలోకంలో మేం దేముళ్ళము; అందుచేతనే మమ్మల్ని భూసురులంటారు. చదువుకున్నదానివి నీకుతెలియందేమున్నది"?

అని తన్నుతాను మోసం చేసుకుంటాడు. మంజువాణి నుంచుకున్న భీమారావుకుకూడా ఆ నమ్మకమే గట్టిగావుంది. మంజువాణి కొండిభట్లును వేళాకోళం చేస్తుంటే "నువ్వు యెంత యెకసెక్యంచేసినా మేం దేవతలమే అందుకు రవ్వంతైనా సందేహములేదు" అంటాడు.

వెంకన్న, రామమూర్తులమధ్య జరిగిన సంభాషణలు, ప్రాచ్య పాశ్చాత్య నాగరికతలు యెంత అవకతవకగా భావించబడుతున్నాయో మనో రంజకంగా చిత్రించుతున్నాయి. కీర్తికాముకత్వంతో సంఘసంస్కారంచేసే దివాన్‌బహదూర్ రాజారాం యీనాటకంలో కనిపించే యింకొకపెద్దమనిషి.

సంఘ సంస్కారానికి దోహదంచేసే పాత్రలూ, సంఘటనలూ యెన్నిటినన్నా పేర్కొనవచ్చు. ఈ సందర్భంలో అపూర్వవ్యక్తి గిరీశం గురించి నాలుగుముక్కలుచెప్పి యీ విషయం ముగిస్తాను.

(4)

సాంఘిక ఉద్యమాన్ని తమ స్వార్థానికి ఉపయోగించుకొనే అనేకుల ప్రతిబింబాలే గిరీశంలో కనిపిస్తాయి. నేడుకూడా యిటువంటివారు మనలో కలసిమెలసి తిరుగుతుంటారు. వీరివల్ల ఆయా ఉద్యమాదర్శాలు మలినం చేయబడతాయి. ఆ ఉద్యమాలకే పెద్దదెబ్బ తగులుతుంది.

* "కన్యాశుల్కమునకు గిరీశమువంటి నాయకునిపెట్టి సంఘసంస్కరణోద్యమమును వేళాకోళములోనికిదించి యుపకృతికిమారు అపకృతియే చేసి"రని ఒకమారు తెలిసియో తెలియకో సాహసించి ఒకసభలో 'డాక్టరు శేషగిరిరావు'గారు అన్నారట. దానిమీద అప్పారావుగారి అభిప్రాయమేమిటో తెలియదుగాని, సంస్కరణోద్యమం ప్రబలమవుతున్న ఆరోజులలో, ఆఉద్యమాదర్శాలను చిలుకపలుకుల్లాగ వల్లిస్తూ, తమ స్వార్థంకోసం ఉద్యమానికి ముప్పుతెచ్చే పనులు చేసేవారు నేటివలెనే నాడుకూడా వుండేవారు; కబుర్లుచెపుతూ సంస్కర్తలుగా తెలియనివారిదగ్గిర చలామణీ అయ్యేవారు; అటువంటివారికి పాఠంచెప్పడమే గిరీశంపాత్ర సృష్టికి కారణం. ఇప్పటికీ సజీవులై వున్న అప్పారావుగారి మిత్రులనూ, సమకాలికులనూ, గిరీశంపాత్ర యెవరినైనా ఉద్దేశించి వ్రాయబడిందా అని నేనడిగితే, ఒకరు చెప్పింది యింకొకరుచెప్పకుండా ఆనాటి వేరువేరువ్యక్తులను పేర్కొంటూ, వారినిబట్టే గిరీశంపాత్రను అప్పారావుగారు సృష్టించేరని అభిప్రాయపడుతున్నారు. ఈ వృద్ధులమాటలనుబట్టిచూస్తే, ఆనాడు కుహనాసంస్కారులూ, ఆషాఢభూతులూ అనేకులుండేవారన్నది స్పష్టపడుతుంది అప్పారావుగారు వీరందరిలోని గుణాలనూ తీసుకొని గిరీశంపాత్రను సృష్టిచేసివుండవచ్చు. అందుచేత యిటువంటి ఉద్యమ విద్రోహులను గిరీశంపాత్రలో బహిర్గతం చెయ్యడం, సంఘ సంస్కరణోద్యమాన్ని వేళాకోళంలోనికి దించడమవుతుందనడం సమంజసంకాదేమో!

సాంఘిక దురాచారాలను బట్టబయలుచేసి సంఘసంస్కారానికి సాహిత్యంద్వారా, అప్పారాయమహాకవికి పూర్వంగాని తరవాతగాని, ఏతెలుగు రచయితా ఆయన చేసినంత అమోఘమైన సేవచెయ్యలేదని నిస్సంశయంగా చెప్పవచ్చు. అప్పారాయమహాకవికి పూర్వమే యుగపురుషుడు వీరేశలింగంగారు సాహిత్యాన్ని సంఘసంస్కరణానికి ఆయుధంగా చేపట్టేరు.

---

* చూ. 'గురజాడ అప్పారావుగారి డైరీలు'

కాని [1] "వీరేశలింగంపంతులు వీలగుచోటనెల్ల ఒక ధర్మవిధిగా సంఘసంస్కారభావములు పాత్రములనోట యత్నతః పలికింపగా, ఈతని (అప్పారాయమహాకవి) కావ్యముల పాత్రములు, ఒకసహజ భావోద్రేకముతో ఈతనివలెనే, కావ్యౌచిత్యమును కుంటుపడక మెరుగుదేరునట్లు సంస్కారాశయములను వెలిబుచ్చును."

వీరేశలింగంగారి ప్రచారవేగంలో కుంటుపడిన కావ్యశిల్పం అప్పారాయమహాకవిలో పరిపక్వతచెందింది.

అప్పారావుగారి రచనలు సంస్కారాశయాలను ప్రచారంచెయ్యడానికి ఉద్దేశించబడినా, కావ్యకళారూపం, అందచందాలకు లోపంకలిగించలేదు. 'సాహిత్యపరిశుద్ధతావాదులూ,' 'కళకోసమేకళ' అనే మతంగలవారూ, అప్పారాయమహాకవి రచనలను - ముఖ్యంగా కన్యాశుల్కాన్ని - ప్రచార సాహిత్యంకింద లెక్కవెయ్యకపోవడానికి యిదేకారణం. సాహిత్యానికి ప్రయోజనం వుండనక్కరలేదనే వీరిని నిందించడానికి బదులు, సాహిత్య ప్రయోజనాలను సమాజాభ్యున్నతికి వినియోగపర్చే రచయితలు, తమరచనలలో అప్పారావుగారివలె శిల్పాన్ని తీర్చిదిద్దినట్టయితే, సమాజానికీ, సాహిత్యానికీ యెంతైనా మేలుచేసినవారవుతారు.

## కన్యాశుల్కం

"సంఘసంస్కరణోద్యమాన్ని బలపర్చడానికీ, తెనుగుభాష నాటకరంగానికి అనుకూలమైనదికాదన్న అపోహ నెదుర్కొనడానికీ, నేను కన్యాశుల్కాన్ని రాసేను."

అని కన్యాశుల్కం రెండవకూర్పు పీఠికలో అప్పారావుగారు రాసేరు. కన్యాశుల్కం రచనకు పురికొల్పిన పరిస్థితులనుగురించి మొదటికూర్పు పీఠికలో అప్పారావుగా రిలాగ చెప్పేరు :

"విజయనగరం మహారాజులుంగారి (ఆనందగజపతి) ఆజ్ఞానుసారం, విశాఖజిల్లాలో మూడు సంవత్సరాలకాలంలో జరిగిన బ్రాహ్మణ శుల్కవివాహాల లెక్కలు పదిసంవత్సరాలక్రితం[2] తీసుకోబడ్డాయి. శుల్కాన్ని పుచ్చుకున్నవారు అది చెప్పడానికి సహజంగా బిడియపడతారు

---

1. 'ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము'లో కొంపెల్ల జనార్దనరావుగారు.

2. మొదటికూర్పు పీఠిక 1-1-1897 నాడు రాయబడింది గాబట్టి 1887 ప్రాంతం అయివుండాలి.

గాబట్టీ యీ లెక్కలు సమగ్రమైనవికావు. అయినప్పటికీ యీ లెక్కలు బాల ముఖ్యమైనవి; ఆసక్తిని రేకెత్తిస్తాయి. ఈ లెక్కలప్రకారం తేలిన పెళ్ళిళ్ళసంఖ్య ఒక వెయ్యి ముప్ఫయినాలుగు. సగటున సంవత్సరానికి మూడువందల ముప్ఫయినాలుగు శుల్కవివాహాలు జరిగేయన్నమాట. తొంభైతొమ్మండుగురు బాలికలు ఐదేళ్ళప్పుడు, నలభైనలుగురు నాలుగేళ్ళప్పుడు, ముప్ఫైఆరుగురు మూడేళ్ళప్పుడు, ఆరుగురు రెండేళ్ళప్పుడు, ముగ్గురు ఒక ఏడాదివయస్సునా వివాహితలయ్యేరు. ఒక ఏడాదివయస్సులో వివాహితులైన బాలికలకు ఒక్కొక్కతెకూ రూ. 350 నుండి రూ. 400 వరకూ శుల్కం పుచ్చుకోబడింది. వింతగా కనిపించవచ్చును కాని, కడుపులోవున్న పిల్లలకోసంసైతం అప్పుడప్పుడు బేరాలు జరిగేవి. ఈ నీచమైన పరిస్థితులు సంఘానికి కళంకం. ఇటువంటి దురాచారాలను బయటపెట్టి ఉన్నత నైతిక భావాలను ప్రచారం చెయ్యడంకంటె ఉత్కృష్టప్రయోజనం సాహిత్యానికుండదు. ప్రజాసామాన్యంలో పుస్తకాలు చదవడం అభ్యాసమయ్యేవరకూ, యిటువంటి సత్ఫలితం నాటకరంగంనుండి మాత్రమే ఆశించవలసివుంది."

కళ కళకోసమే అనీ, సాహిత్యం ప్రచారమయం అయిపోతున్నదనీ, కన్యాశుల్కరచనజరిగి అర్ధశతాబ్దం అయినా, యీనాటికికూడా కంగారుపడేవారు అప్పారాయమహాకవికేం సమాధానంయిస్తారో ?

ఆయనకు సాహిత్యం ఒకభోగవస్తువుకాదు. చూపరులకు దిగ్భ్రమ కలిగించే గారడీఆట కాదు.

మహాకవి అప్పారావుగారికి సాహిత్యం అవశ్యాచరణీయమైన పరమ ధర్మం. సాహిత్యం ఆయనకు మానవసేవా సాధనం. అందుకే

"యీసురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయి?"

అని గుండెలు పట్టుకునే - హృదయమున్నవారికి - ప్రశ్నవేసేరు. అందుచేతనే కన్యాశుల్కాన్ని రచించేరు.

* "అవినీతికరములైన విషక్రిములతో కూడుకొన్న దుర్భర బాని సత్వంనుండి దిక్కులేని మనస్త్రీలను కొందరిని రక్షించడానికి" ఆనంద గజపతి మహారాజు ఆలోచిస్తున్నప్పుడు. "ప్రజాసామాన్యానికి గ్రాహ్య

* చూ. కన్యాశుల్కం కృతిసమర్పణం.

మయ్యేనాటకంలో యీ చెడుగును వెల్లడిచేసి, ఆందోళనను ప్రేరేపించ డానికి" అప్పారావుగారు తమ "అల్పశక్తిని వినియోగించి" ఈ కన్యా శుల్కాన్ని రచించేరు.

ఆంధ్ర నాగరికతా సంస్కృతులమీద భూస్వామిక ప్రాబల్యంపోయి మధ్యతరగతి ప్రాబల్యం ఆవరించుకొంటున్న రోజులవి. వీరేశలింగంగారు ఆంధ్రసమాజ చరిత్రలో నూతనయుగ ప్రారంభానికి పునాదులు వేస్తున్నారు. మౌఢ్యాలపైనీ, దురాచారాలపైనీ త్రిశూలంవంటి ప్రశ్నార్థకాన్ని ప్రయో గించేరు, వారి సంఘ సంస్కరణోద్యమం గుడ్డినమ్మకాలకు సుత్తిపెట్టి యుండి. హేతుబలంలేని ఆచార సాంప్రదాయాల్ని నిర్దాక్షిణ్యంగా ఆయన తన ప్రహసనాల్లో విమర్శించేరు. ఆంధ్రసమాజ జీవితంలో వీరేశలింగం గారు అద్వితీయ పురుషులైనారు మేధావంతులనేకాక సామాన్యులనుకూడ చాలమందిని వారి చరిత్రాత్మక ఉద్యమం ఆకర్షించింది. ఆదర్శవాదిఅయిన అప్పారాయ మహాకవినిసైతం వీరేశలింగంగారు ఆకర్షించేరు.

[1] "అప్పటికి ప్రసిద్ధులైన ఆంధ్ర ధీరాగ్రేసరులు రావుబహద్దరు కందుకూరి వీరేశలింగం పంతులుగారి జీవితం కొంతవరకాయనకు మార్గ దర్శకమై యుండునని నాఊహ....సాహిత్యరచనతో సాంఘికసేవచెయ్యడ మనేది అప్పారావుగారికి వీరేశలింగంగారి రచనల వల్లస్ఫురించివుంటుంది." అని అప్పారాయ మహాకవి శిష్యులైన శేషగిరిరావుగారన్నారు.

[2] "వీరేశలింగం పండితుడు - నిశ్చయముగా మహాపురుషుడు. సాహిత్యములో ఒకశాఖచేసి, సంఘములో పురోభివృద్ధిపంథా లేవదీసి నాడు." అని మహాకవి రాసుకున్నారు.

సంఘ పురోభివృద్ధికి సాహిత్యాన్ని సాధనంగాచేసిన వీరేశలింగం గారి యెడల మహాకవికి చాలా భక్తిభావముండేది. ఒక మహాపురుషుడు యింకొక మహాపురుషుణ్ణి ఆకర్షించేడు.

సంఘపురోభివృద్ధి సాహిత్యానికి పరమార్థమని నమ్మిన అప్పారావు గారికి నాటిసాహిత్యధోరణి కాలానుగుణంగా లేకపోవడమేకాకుండా అభి వృద్ధి నిరోధకంగాకూడా వుందని స్పష్టపడింది. వ్యవహారికభాషావుద్యమం ఆయనకు సాహిత్య సంస్కరణోద్యమం మాత్రమేకాదు. పైనుదహరించ

1. చూ. 'గురజాడ అప్పారావుగారి డైరీలు'
2. డిటో 12-1-1911 డైరీ.

బడిన కన్యాశుల్కం పీఠికల్లో అప్పారావుగారు చెప్పినదానినిబట్టి "....దురాచారాలను బయటపెట్టి ఉన్నత నైతికభావాలను ప్రచారంచెయ్యడంకంటె ఉత్కృష్టప్రయోజనం సాహిత్యానికుండదు"— అంటే సంస్కారాశయాల్ని వెలిబుచ్చి, సంఘాభ్యున్నతికి తోడుపడడమే సాహిత్యానికి ముఖ్యకర్తవ్యం అని ఆయన నమ్మకమైనట్టు తేటతెల్లమవుతుంది.

పండితుల విహాస్యమైన గ్రాంధికభాషద్వారా కాకుండా ప్రజాసామాన్య భాష అయిన వ్యావహారికభాషద్వారా, ప్రజాభ్యుదయానికి దోహదంచేసే సంస్కారభావాలను వెదజల్లడమే కావ్యప్రయోజనంగా పెట్టుకొని అప్పారావుగారు కన్యాశుల్కాన్ని రచించేరు. అందుచేతనే. "నాది ప్రజల ఉద్యమము; దానిని ఎవరిని సంతోషపెట్టడానికైనా వదులుకోలేను" 1 అని తన ఆదర్శాన్నీ, కార్యదీక్షనూ తమ దినచర్యలో రాసుకున్నారు.

ఆయన తపస్సు ఆనాడేఫలించింది. "సంఘసంస్కారణం వ్యావహారికభాషఅంటే గిట్టని కొక్కొండ వెంకటరత్నంగారిని మినహాయిస్తే మొదటికూర్పు విజయవంతమయింది. పత్రికలు ప్రేమతోస్వీకరించి తెలుగు సాహిత్యచరిత్రలో ముఖ్యమైన సంఘటన అని ప్రశంసించేయి. ఎంతో ఆసక్తితో పురుషులు, స్త్రీలు, పిల్లలు చదువసాగేరు. కొద్దివారాలలో మొదటి కూర్పు ప్రతులన్నీ చెల్లిపోయేయి." 2

కన్యాశుల్కరచనను పురికొల్పిన పరిస్థితులనుగురించీ, ఆనాటి మన నాటకరంగాన్నిగురించి రెండవకూర్పుపీఠికలో యిలారాస్తున్నారు :

"ఈ నాటకంరాసినప్పుడు, నాకు ప్రచురిద్దామన్న ఉద్దేశంలేదు. సంఘసంస్కరణోద్యమాన్ని బలపర్చడానికి, తెలుగుభాష నాటకరంగానికి అనుకూలమైనదికాదను అపోహ నెదుర్కొవడానికి, నేను కన్యాశుల్కాన్ని రాసేను. ఊహూ తిరిగే మహారాష్ట్ర నాటకసంఘాలు తెలుగుజిల్లాల్లో హిందీ నాటకాలువేసి డబ్బుసంపాదించేవి. స్థానికనాటకసంఘాలు వీటిననుకరించేవి. తమకు అర్థంకానిదానిని ప్రేక్షకులు ఆనందంగా వినేవారు. అజ్ఞానాన్ని గురించి యింతకన్న ఎక్కువగాచెప్పడానికి సాధ్యంకాదు. తళుకు, బెళుకు వేషాలు, కామాన్ని ప్రేరేపించే నృత్యగీతాలు, కృత్రిమయుద్ధాలు, మొదలైన తక్కువరకపు నాటకాకర్షణలకు కన్యాశుల్కం తావియ్యలేదు. ఆయినా

1. చూ. 1911 మార్చి 27.

2. చూ. కన్యాశుల్కం రెండవకూర్పు పీఠిక.

తండోపతండాలుగా ప్రజలను ఆకర్షించింది. మాతృభాషపై ప్రేమను స్థిరపర్చింది.

"హిందీ నాటకప్రదర్శనాలు నానాటికీ తగ్గిపోతున్నందుకు నాకు సంతోషంగావుంది కాని ఆంధ్రనాటకరంగంస్థితి సంతృప్తికరంగా వుందనుకోవడానికి యేవిధంగాను వీల్లేదు. చెప్పుకోదగ్గ నాటకసంఘాలు లేవు. నాటకాభినయాన్ని కళగా అభ్యసించేవృత్తి - నటకులులేరు. మంచి నాటకాలుకూడా అట్టేలేవు విషమ సాంఘికపరిస్థితులను ముందుపెట్టే అధునాతన జీవితాన్ని, ప్రహసనాలకుతప్ప, నాటకరచయితలు ఉపయోగించుకోవడంలేదు. పురాతన శృంగారవిషయాల్నే పిండిందేపిండం రాయడం కల్పనాదారిద్ర్యాన్ని తెలియజేస్తుంది. నాటకసాంకేతికాన్ని యెరిగిన రచయితలు చాలతక్కువ. యాభై సంవత్సరాల విశ్వవిద్యాలయవిద్యాభ్యాసమూ పాశ్చాత్యసంస్కృతి ప్రాబల్యమూ జరిగిన తరవాత, సాహిత్యశిల్పం యింత తక్కువస్థాయిలో వుండడం ఆశ్చర్యపడవలసినవిషయం. మన కళాశాలల్లో యింగ్లీషుబోధనాక్రమం లోపభూయిష్టంగా వుండడమే దీనికి కారణమని చెప్పాలి. ఇంగ్లీషు ప్రొఫెసర్లూ, విద్యాధికారులూ దేశభాషల్ని దోహదం చెయ్యడానికి బాగాకృషిచేసి బాధ్యతతీసుకున్నదాకా, బహుశా మంచిపరిస్థితులు వస్తాయనుకోవడానికి వీల్లేదు."

నాటక ప్రయోజనాన్ని అప్పారావుగారు సరిగా గుర్తించేరు. సంఘంలోవున్న దురాచారాల్ని వెల్లడిచేసే నైతికభావాల్ని ప్రజాహృదయంలో నాటడానికి, ప్రజాసామాన్యానికి చదవడం అభ్యాసమయ్యేవరకూ నాటకరంగమే చాలా ఉపయోగకరమన్న నమ్మకమే కన్యాశుల్కనాటక రచనకు పురికొల్పింది. 'కొండుభొట్టీయం' నాటకరచనకుకూడా యిదే కారణం అని చెప్పనక్కరలేదు.

కన్యాశుల్కంరచన జరిగిననాటికి ప్రాచ్య పాశ్చాత్య నాటకాలు - యింత నిజమైనవి, యింత చక్కనివి, యింతటి ఉపజ్ఞాపూరితాలైనవి, అధునాతన జీవితాన్ని అచ్చుగుద్ది ప్రాణంపోసినవి, యెన్నివున్నాయో, అవి కన్యాశుల్కంముందు ఎలా నిలబడగలవో బహుభాషాకోవిదులైన విమర్శకులు నిర్ణయించవలసిన విషయం.

[1]"ముఖ్యంగా నాటకరచనవిషయంలో నీవుప్రదర్శించినప్రతిభ సమకాలిక భారతదేశంలోనేకాదు; సమకాలిక ప్రపంచంలోనే గణితించదగినట్టిది.

1. చూ. "అప్పారాయకవి:" - నార్ల వెంకటేశ్వరరావుగారు.

"సీఫ 'కన్యాశుల్కము' నాటకాన్ని - ఒక సమకాలిక సమస్య యితి వృత్తంగా - ప్రకటించిననాటికి యూరప్‌ఖండలోనైనా క్రొత్తనాటకం అంతగా ప్రచారంలోనికి రాలేదు."

కన్యాశుల్కం అత్యుత్తమకావ్యం కావడానికి కారణం, అప్పారావు గారికి, దురాచారాలను రూపుమాపి సమాజాభ్యున్నతికి తోడుపడాలని దీక్ష, ఆవేశం వున్నంతమాత్రంచేతకాదు. కావ్యనిర్మాతకు ఆవేశం వున్నంత మాత్రానచాలదు. ఆదీక్షనూ, ఆవేశాన్నీ రూపంలోపెట్టగల పదజాలంతో రచనా సామర్థ్యం అలవడినాచాలదు. "భూతకాలం కూర్చిన మహత్తరత నంతా.... స్వాయత్తం చేసు(కుని) ....భవిష్యత్తులోనికి ఉత్తమమార్గాన సంఘాన్ని నడిపించడం తన నిరంతరలక్ష్యంగా ఎంచు"కోవాలి. "భూత భవిష్యత్తులు ఎంత విలువగలవి అయినప్పటికీ (తన).... ఆందోళనా యత్నమూ, వర్తమానానికి చెందినవే....(తన) హృదయం కొట్లాట వర్తమానంలోనే"[1] అన్న సత్యాన్ని మర్చిపోకూడదు తన కావ్యాన్ని సాక్షాత్కారం చేసుకోవాలి. తన కావ్యంలోని పాత్రలలోనూ సంఘటనల లోనూ తాను జీవించాలి, జీవితాన్ని ప్రపంచాన్ని సునిశితదృష్టితో పరిశీలన చెయ్యాలి. చేసి ముందువెనకల దృష్టితో, ప్రస్తుతాన్ని అవగతంచేసుకొని, తాను తనకావ్యాన్ని చదివి ఆనందించేవారితోబాటు వెలుగుబాటలోనికి నడవాలి.

తను వెలుగుబాటలోనికి నడిచి తనవెంట వేలకొలది తెలుగువారిని వెలుగుబాటలోనికి నడిపించేరు అప్పారాయమహాకవి. అంచేతనే ఆయన [2] 'నవ్యాంధ్ర సారస్వతమునకు శ్రీరాములుచుట్టిన ఆదికవి' కాగల్గేరు. "అప్పారాయకవి ఆంధ్రవాఙ్మయానికి ఒక సరిహద్దు. ఈయనతో నవ్య సారస్వతయుగం మొదలైనది."

కన్యాశుల్కాన్ని ఆనాటి జీవిత సర్వస్వమని అనవచ్చు. అనేక జాతులు, వృత్తులు, దృక్పథాలు వాటివాటి సహజమైనభాషతో, ప్రవర్త నతో, సంఘర్షణలతో, సుఖదుఃఖాలతో కళ్ళకుకట్టినట్టు చిత్రించబడ్డాయి, మహాకవి అప్పారావుగారు జీవితాన్ని ప్రపంచాన్ని అనేక దృక్కోణాల నుండి సునిశితంగా పరిశీలించి, నాటి జీవితాన్నేకాకండా సమస్యల్నికూడా అసమానమైన కల్పనా కౌశల్యంతో ప్రదర్శించేరు. సాహిత్య పురోభివృద్ధికి

1. చూ. 'వైతాళికులు' పీఠికలో ముద్దుకృష్ణగారు.
2. చూ. 'గురుజాడ వాల్మీకి' — ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు.

సంకెళ్ళగా పరిణమించిన పండిత సాంప్రదాయాలను, కోకలిపాటగా పరిణమించిననాటి కావ్యరచనా విధానాన్ని ధిక్కరించి సహజమైన, సజీవమైన భాషలో, నాటినుంచి నేటివరకూ అక్షరాలా అద్వితీయంగా నిలచినకావ్యాన్ని తెలుగుజాతికి ప్రసాదించేరు. సంఘంలోని మౌఢ్యాన్నీ నికృష్టతనీ బహిర్గతంచేసి. సంఘాభ్యుదయానికి విత్తనాలునాటేరు.

'కావ్యదోషాలు' శబ్దంతో తీర్చిదిద్దినవి కావచ్చు. సజీవమైనవేమో అని భ్రమపెట్టినప్పు అయినా అవి వాస్తవికంగా నిర్జీవాలు.

కాని "అప్పారావుగారి పాత్రలు సంపూర్ణంగా మానవత్వంతో నిండినవి. ప్రాణమున్న ప్రతిఒక్కరిలోనూ అవి జీవించి, జీవితాన్ని ఉత్సాహవంతంగా చేస్తాయి." 1

లోపంలేనిది సృష్టిలోనేలేదు. అలాగే కన్యాశుల్కానికికూడా కొన్ని లోపాలున్నాయి,

ప్రదర్శించడానికి అనుకూలంకానంతగా కన్యాశుల్కం పెరిగిపోయింది.

యీనాటి అభిరుచికి సరిపోని స్వగతాలు కన్యాశుల్కంలోవున్నాయి. యీ రెండులోపాల్ని అప్పారావుగారుకూడా గమనించేరు.

తను ప్రదర్శించదలుచుకున్న సమస్యలను అంతకన్న తక్కువగా కుదించడం తనకు సాధ్యంకాలేదని అప్పారావుగారి నేవారట. అంచేతనే కాబోలు కన్యాశుల్కాన్ని మూడుభాగాలు (ట్రియాలజీ)గా రాయడానికి అప్పారావుగారు ఉద్దేశించేరు. ఒకటి రెండు రంగాలుకూడా రాసేరు. అసంపూర్ణంగా నిలచిపోయిన 'బిల్హణీయ' నాటకం, కన్యాశుల్కం ట్రియాలజీ, గ్రాంధిక వ్యవహారికభాషావాదోపవాదాల్లో విడుచుకోవలసివచ్చింది.

అదేవిధంగా స్వగతాలుతీసివేసి నూతన అభిరుచులకు అనుగుణ్యంగా కన్యాశుల్కాన్ని మార్చడానికీ అప్పారావుగారు ప్రయత్నించేరు. స్వగతాలున్నచోట్ల తమప్రతిలో గీట్లుపెట్టేరు — కాని జీవితం కలసిరాలేదు.

అయినప్పటికీ రామలింగారెడ్డిగారన్నట్టు :

"2 అది జీవితంతోనూ మానవత్వంతోనూ పరిపూర్ణమైవుంది. దానిలోనిస్త్రీలుపురుషులూ దయాదాక్షిణ్యాలతోను, విపరీతాలతోను అయుక్తాల

1. చూ. కె. కృష్ణయ్యంగారు చేసిన కన్యాశుల్కం కన్నడ అనువాదంలో కట్టమంచి రామలింగారెడ్డిగారి పీఠిక.

2. చూ. ఆదే పీఠిక.

తోను, క్రౌర్యాలతోను కుయుక్తులతోనూ, పవిత్రతతోను వంచకత్వంతోనూ, తిరుగులాడతారు ప్రకృతి-ఆచారం, హేతువు-సాంప్రదాయం, అభిప్రాయం-వాస్తవం, ఒకదానితో నొకటి తీవ్ర సంఘర్షణకు తలపడ్డ నిజజీవితంతో యిది నిండిపోయింది.

కన్యాశుల్కాన్ని విపులంగా చర్చించడానికి యిది స్థలంకాదు. దాని ప్రయోజనం, కల్పన, శైలి, నవ్యత, సాటిలేనివి అని చెప్తేచాలును.

మోటుసరసాన్ని హాస్యంగా అలవాటుచేసుకొన్న తెలుగుసాహిత్యానికి, సభ్యమైన సరసమైన హాస్యాన్ని అప్పారావుగారు ప్రసాదించేరు, హాస్యంకోసం సన్నివేశాలు కల్పించబడక, సహజంగా, పాత్రపోషణచేస్తూ నాటకంలో హాస్యం అల్లుకపోయివుంటుంది. ఇది అప్పారావుగారి విశిష్టత.

గంభీరమైన సన్నివేశాలుకూడావున్నాయి. కరటకశాస్త్రులు, లుబ్ధావధానులుపడ్డ ఆవస్థలు ఆలోచించండి. వాళ్ళిద్దరూ ఎంతప్రమాదకరమైన స్థితికి వచ్చేరో గమనించండి.

పాత్రలు మాటాడే హాస్యంకంటే, వారి మాటలతో భావాలతో ప్రవర్తనతో వేరులేరు వ్యక్తులు హాస్యపాత్రులవుతారు. తమబండారాన్ని బయటపెట్టుకుంటారు.

కాని 'తూకం'లో హాస్యరసం బరువు కన్యాశుల్కంలో యెక్కువై పోయింది. ఏడిపించవలసిన పరిస్థితులు నవ్విస్తాయి. అప్పారాయ మహాకవి 'మీపేరేమిటి?'లో చూపిన 'తూకం' కన్యాశుల్కంలో చూపలేదు. అగ్నిహోత్రావధాన్లు రామప్పంతులు గిరీశం మొదలైనవారు తీవ్రంగా గర్హించవలసినవారు. హేళనచేసి తేలికగా దాటిపోనియ్యవలసినవారుకారు.

అయినప్పటికీ మానవప్రకృతిని చూపడానికి కన్యాశుల్కం అద్దమై నిలిచింది. 'లోకమందలి మంచిచెడ్డలు, లోకులెరుగుదురా?' అని ప్రశ్నించి అప్పారాయమహాకవి, లోకమందలి మంచిచెడల్ని లోకం కళ్ళయెదుట నుంచి మహాపురుషుని బాధ్యతను నిర్వర్తించేడు.

కన్యాశుల్కంలోని వివరాలలోనికివెళ్తే ఒకంతట బయటపడడం సాధ్యంకాదుగాబట్టి, యీసందర్భంలో అప్పారావుగారి నాటకకళాపాండిత్యాన్నీ కృషినీ కొంచంచూదాం.

తక్కిన సాహిత్యంలాగనే నాటకకళకూడా ఊసుపోని విలాసం కోసం కాదనీ, ముఖ్యంగా ప్రజాభ్యుదయానికి సాధనంగా ఉపయోగించాలనీ ఆయన నమ్మకమైనట్టు కనిపిస్తుంది.

"యూరేషియనులను గురించి ఒకనాటకం నేను వ్రాసి వారియెడల అనుకంపాదృష్టి కలిగించవలెను. ఈసంకరులను యింగిలీజులుపెట్టే క్షోభ నాఇంగిలీజులే సిగ్గుపడేటట్లు చేయవలెను." అని 1895 మే 4 వ తారీఖున తమడైరీలో రాసుకున్నారు.

మద్రాసు మొదలైన పట్టణాలకు వెళ్ళేటప్పుడు ఇంగ్లీషువారి సహవాసమూ, యూరేషియన్ల సహవాసమూ ఆయనకుండేది. కాబట్టి యూరేషియన్లను యింగ్లీషువారు పెట్టే క్షోభ ఆయనలో యీ భావాన్ని రేకెత్తించి వుండవచ్చు. ఇటువంటివే అప్పారావుగారు నాటకాలు మొదలైనవి రాయడానికి అనేక సూచనలు తమ డైరీలలో రాసుకున్నారు.

అప్పారావుగారు తమ డైరీలలో రాసుకున్నదానిబట్టి ఆయన "గ్రీకు, రోమన్, ఇంగ్లీషునాటకక్రమములు జాగ్రత్తగా పరిశీలించుచుండినట్లు తోచును. ప్రదర్శనయోగ్యములైన నాటకములపైన మోజుకనబడుచున్నది. ఆయన ఇంగ్లీషు, పరాసు, ఫారసీ, చీనా మొదలగు విదేశీయ నాటక ప్రయోగములనుగురించియేగాక నాటకములో హాస్యరసము గురించిన్నీ, విదూషకులను గురించిన్నీ, సంఘటనములకూ పాత్రరచనలకూగల సంబంధము గురించిన్నీ, పాత్రోచితమైన వేషమును గురించిన్నీ, ఆయానాటక కర్తలాయానాటకము లేల వ్రాయుదురనిన్నీ; నాటకరచయితల కష్టనిష్ఠురముల గురించిన్నీ విపులముగు విమర్శలు చరువుచుండినట్లు కనపడును. మన నేటి నవ్యసాహిత్యపరులకుకూడా పై విమర్శలవంటివి రచనా రహస్యములను స్ఫురింపజేయగలవు." 1

అప్పారావుగారు మననాటకాలను విదేశనాటకాలతో సరిపోల్చి చూసుకొనేవారు. అనేక నాటక ప్రదర్శనాలు చూసేవారు. డైరీలలో తాము చూసిన నాటక ప్రదర్శనలగురించి తమ అభిప్రాయాలను రాసుకునేవారు. వీటినిబట్టి, నాటకకళపట్ల ఆయనకు యెంత పరిపక్వమైన భావాలుండేవో విశదమవుతుంది.

ఒకనాడు మద్రాసులో 'డంబాచారివిలాస' మన్న నాటకప్రదర్శనాన్ని చూసేరు. అందులో నాయికవేషం ధరించిన "బాలామణి" అన్న వేశ్యలో వున్న ఆత్మవ్యతిరేకతగురించి యిలాగ రాసుకున్నారు :

---

1. బుర్రా శేషగిరిరావుగారు - "గురుజాడ అప్పారావు డైరీలు"

"ప్రిన్స్ మేమెటింపే మే సుపిరాసు బంగారుపిచికనో సర్వనాశనం చేసిన యీ భోగప్రపదము, ఈ వందాహారినాటకంలో అట్టి సర్వనాశముచేసే పదుష్పకన్స వేషం అధినయించి తన జీవితమునే గర్హింపజేసే నీతిని బోధించునట."

నాటకరచనలో అప్పారాయ మహాకవి పాశ్చాత్య పద్ధతి చాలవరకు అలవర్చుకున్నారు. కన్యాశుల్కంలో పాశ్చాత్యనాటకకర్తల ప్రభావం కనిపిస్తుంది.

1907 లో రాసిన కొండుభట్టీయంలో రైలుబండికూడా ప్రవేశపెట్టబడింది. భారతీయ నాటకరంగంలో నేటివరకూ అది ప్రదర్శన సాధ్యం కాకపోయినా, పాశ్చాత్య నాటకరంగంలో యిది సాధ్యం చేయబడింది. [1]

## వ్యావహారిక భాషాఉద్యమం

"కుమారరమి మహాభారత తర్జుమాతో ప్రారంభమైన తెనుగువారి సారస్వతం, క్రమేణ ప్రబంధాల్లోకిదిగి, గతశతాబ్దపు మధ్యభాగంవరకూ, ప్రబంధాల్లోంచి బయటపడలేకపోయింది. అంతవరకూ దేశంలో పరమతాలూ, పరప్రబోధాలు వ్యాపిస్తూయున్నా, హిందువుల్లో మట్టుకు సాంఘిక పరివర్తనము అంతయెక్కువగా జరిగినట్లు కనిపించదు. ఇంగిలీషులు దేశంలో ఎక్కువభాగాన్ని స్వాధీనపరుచుకొని, స్థిరంగాయుండి పరిపాలన సాగించేవరకు, హిందుప్రజల్లో మార్పు అంతవిశేషంగా బయటపడలేదు; పూర్వాచారాల్నే, పూర్వసాంప్రదాయాల్నే, ప్రజలనుసరిస్తూయుండేవారు. విద్యావిధానంలో మార్పు క్రమశః అటుతరువాతనే యెక్కువుగా కనిపించడం ప్రారంభించింది. ప్రకృతి శాస్త్రజ్ఞానవ్యాప్తితో చదువుకున్నవాళ్ళ నమ్మకాల్లో కొంతమార్పు కనిపించింది. ఇంగిలీషు సారస్వతాన్ని పరీక్షలకైనా చదవడంచేత, కోరినా కోరకపోయినా, మన సారస్వత సాంప్రదాయాలతో భిన్నించే సొగసైనవి గొప్పవి. పర సారస్వత సాంప్రదాయాలు కూడా యున్నాయని చదువుకున్నవాళ్ళకి స్పష్టమైంది. వారు చదివి యానందించిన పరభాషల్లోని యుద్గ్రంథాలు వారిలో నూతనవికాసాన్ని పుట్టించాయి. చిరకాలంనుంచి వస్తున్న సంస్కృత కావ్యాలు, నాటకాలు, ఆంధ్రప్రబంధాలు, ఆంధ్రభారతాదులే, సాహిత్యం సంపాదింప ప్రయత్నించేవాళ్ళకి ముఖ్యమైన గ్రంథాలైయుండేవి. పండితులు వీనినే చదివి. వేరేమీ చూడ

1. See 'Distant Point,' a Soviet Play

కుండా కాలక్షేపం చేస్తూయుండేవారు. రాజభాష యింగిలీషుభాష యవటం చేత, రానురాను ఈ పురాణ సారస్వతాన్ని చదివేవారిసంఖ్య తగ్గిపోయింది ........యింగిలీషు ప్రభుత్వం సుస్థిరంకాగానే, పెరుగుతున్న ఆర్థిక పరిస్థితులు బట్టబయలైనాయి. ప్రజలు అన్నంలేక మాడిపోతున్నారనీ, ఈ దుస్థితి ప్రజలకు కలగడం మన దుష్టసాంఘిక పరిస్థితులవల్లనే కలుగుచున్నదనీ, సంఘం మరామత్తుకయి, ప్రజాప్రభుత్వము స్థాపనమయి, పరప్రభువుల స్వచ్ఛందవిహారం కట్టిపెడితేనేగాని ప్రజలకు మరి ముక్తి లేదని ప్రజల్లో కొంత యలజడి కలిగింది. ఈ కలవరపాటునకు కారణమైన పరప్రబోధం, ప్రజలకళ్లు విప్పడంచేత, వారిలో నూతనోద్రేకం పుట్టింది. ఆత్మగౌరవం కల్గింది. మనవారు తిరిగి మన ప్రబోధాన్ని పరీక్షించడానికి యారంభించేరు. జాతీయభావాలతో ఆత్మగౌరవముపెరిగింది. అంతవరకూ కొంత నిరసించబడ్డ జాతీయ సారస్వతం తిరిగి ప్రజలదృష్టి నాకర్షించింది. ........ప్రబంధాలాధారపడియుండిన అపార సాంప్రదాయ ధర్మాలు అడుగంటేయి. సంఘంలో నూతన పరిస్థితులేర్పడ్డాయి. సూర్యచంద్రులు దూరిపోయేటంత యెత్తైనభవనాలు, సముద్రమంతలోతుగాను, వెడల్పుగాను యుండే అగడ్తలు, మన్వాది ధర్మశాస్త్రాల్లో నియమాలనుదాటని చాతుర్వర్ణ్యం, లక్షణగ్రంధాల్లోని నియమాల ననుసరించియుండే నాయకనాయికలూ, వారి శృంగారచేష్టయూ, వారి వియోగం, నాయిక కాంభోజిలోనో యింకో రాగంలోనో రోదనం చేయడం — ఇవన్నీ ప్రజలకంతగా రుచించడం మానాయి. ప్రజల రుచులలో విపరీతమైన మార్పు కలిగింది. ప్రాచీన సాంప్రదాయాలనే పట్టుకొనియుండిన పండితులు. ఇది తెలుసుకోలేక పోయేరు. కలుగుతున్నమార్పు సారస్వతానికి ముప్పుతెస్తుందన్నారు. ప్రాచీన లక్షణ విరుద్ధంగా గ్రంధాలుండకూడదన్నారు. కవిత్రయం, ఆటుతరువాత విశిష్ట ప్రబంధకర్తలు ఉపయోగించిన భాషే. ప్రయోగాలే తప్ప వేరేవి గ్రంథాల్లో వినియోగింపబడకూడదన్నారు. వాడుకభాష గ్రంధాల్లోవాడ్డానికి వీల్లేదన్నారు. శాస్త్రుల్లవారు కవుల కనుశాసకులు కాడానికి ప్రయత్నించారు. వాడుకభాష గ్రామ్యం, అశ్లీలం అన్నారు. కాదన్న వాళ్ళని తర్జించారు. కొత్తవ్రాతలు, కొత్తపోకళ్ళ ననుసరించి మహాప్రవాహంగా వస్తుంటే నెత్తిమొత్తుకున్నారు, గంతులేసేరు, విలపించారు, లాభం లేకపోయింది. పాండిత్యంలేకపోయినా, ప్రాచీనగ్రంథాలను బట్టీ వేయలేకపోయినా, కొత్తవ్రాతగాళ్లు పండితుల తర్జనలను, విలాపాలను,

వెక్కిరింపులను నిరసనలను లెక్కజేశారుకారు. ప్రజాసామాన్య సారస్వత రక్తధ్వజం ఎత్తబడింది. ఈ రక్తధ్వజమే పండిత వృషభములకు రక్త వస్త్రశకలం అయింది. వారు బెదిరారు, వారు బెదిరిచేసిన చేష్టలు చూపరులకు కొంత తమాషా కలుగజేసింది; ఇందుల కలవాటుపడ్డారు. బెదురు తగ్గింది. కాని బెదురుమాత్రం సుతరాం పోలేదు పోదు. ఐతేనేం. ఉండనీ! ఈ రక్తధ్వజాన్ని ఎత్తినవారిలో నగ్రగణ్యులు గురుజాడ వేంకట అప్పారాయ కవి". 1

కిడాంబి రంగాచారిగారి పై వాక్యాలు, పందొమ్మిదవ శతాబ్దం ఆఖరు సంవత్సరాలలోవున్న మన సారస్వత స్థితిని సూక్ష్మంగా చెపుతున్నాయి.

అప్పారాయ మహాకవి వ్యవహారికభాషా ఉద్యమాన్ని కాకతాళీయంగా చేపట్టలేదు. దాని ఒడుదుడుకులు సాధక బాధకాలు సాకల్యంగా పర్యావలోకనంచేసి ఒక నిశ్చయానికి వచ్చేరు:

2"తెనుగు భాషను పెద్ద నాగరికతా సాధనంగా చెయ్యాలంటే, అనవసరంగా వ్యవహరింపబడుతున్న పదాలనుండీ సంస్కృత పదాలనుండీ తెలుగుభాషకు విముక్తికలిగించాలి. పరిపూర్ణమైన వ్యవహారికభాషను ప్రవేశ పెట్టాలి. తెలుగుదేశంలో వేరువేరు ప్రదేశాల్లో మాటాడే భాషలో అట్టే తేడాలేదు, కాబట్టి సమర్థులైన రచయితలు గట్టిగా పూనుకున్నట్టయితే తెలుగువారందరికీ సామాన్యమైన కొత్తభాషను తేలికగా స్థాపించవచ్చును"

"చాలా కృత్రిమమైన సారస్వతభాషా నియింతృత్వం వల్లనూ, అనుప్రాసముతోకూడుకొని కఠినమైనపద్యరచనాపద్ధతివల్లనూ, చాలకాలమై గతించిపోయిన పురాతన సారస్వత పద్ధతులవల్లనూ, తెలుగు మేధస్సు ప్రమాదకరమైన కూపంలో పడిపోయింది....

"తెలుగు సారస్వతభాష, సాంప్రదాయంవల్ల తెలుగువారి నెత్తిమీద రుద్దబడిన పెద్ద అటంకమని నాఉద్దేశం. సంకెళ్ళను ప్రేమించేవారిని దానిని పూజించనివ్వండి. ఏభాషలోనైతే మనసుఖదుఃఖాలను మనసుందరమూ జంకులేకండా వ్యక్తపరుస్తున్నామో - కాని ఏభాషలోనైతే కొందరు తమ భావాలను రాతద్వారా వ్యక్తంచేసుకోడానికి జంకుతున్నారో - ఆ సజీవమైన

1. 'ముత్యాలసరాలు' రెండవకూర్పు 'మొదటిమాట'లో.

2. చూ. కన్యాశుల్కం మొదటికూర్పు పీఠిక.

తెలుగు, 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' అనబడే తెలుగు. నా మాతృభాష యైన వ్యవహారిక తెలుగే నాకు కావాలి. వ్యవహారికభాషలో రచింపబడిన సారస్వతం మనదేశంలోని రైతులను మేలుకొల్పుతుంది. మనదేశంలోని ఇంగ్లీషువారిని కదుపుతుంది. దానివల్ల అసంఖ్యాకములైన ప్రయోజనాలున్నాయి."1

అప్పారాయ మహాకవి భాషాప్రేమనూ భాషాకృషినీ కార్యదీక్షనూ పైనుదహరించిన వాక్యాలు వ్యక్తంచేస్తాయి.

"ఇంగ్లీషుభాషాశైలి ప్రాకృతాల చరిత్రలు తెలిసివున్నవారితో, మన మాతృభాషా సారస్వతాలగురించి వాదించనక్కరలేదు; కొత్త తెలుగు భాషను పరిణతిచెందించేవి వాదోపవాదాలు కావని నేనెరుగుదును. ఒక గొప్పరచయిత దాన్ని రాసి సృష్టించాలి. ఆగొప్పరచయితకోసం మనం పునాదులువేద్దాం." 2

ఆ నూతన భాషాశైలిని సృష్టించిన గొప్పరచయిత తానే అని అప్పారాయమహాకవికి తెలియదేమో ?

మహాభారతయుద్ధంలో కృష్ణార్జునులవలె అప్పారాయమహాకవీ, గిడుగురామమూర్తి పండితుడూ ఆనాటి అభివృద్ధినిరోధకులను ఓడించి తమ ఆదర్శాన్ని స్థాపించుకోగల్గేరు. మహాకవి అప్పారావుగారు సారధియై వ్యవహారికభాషారథాన్ని ముందుకు నడిపించుకపోయారు గిడుగు పండితుడు ప్రతికక్షులతో యుద్ధాలుచేసి ఓడించి రథానికి దారిచేసేరు.

ఒక ఆశయంగా ప్రారంభమైన వ్యవహారికభాష రానురాను మహా ఉద్యమమైంది. వ్యవహారికభాష ఒక ఆశయంగావున్న రోజుల్లోనే అప్పారావుగారు కన్యాశుల్కాన్నిరాసి, దాని హక్కులను అందచందాలను స్థిరపర్చేరు.

ఆశయమై వుంటున్నరోజుల్లోనే, జె.ఎ. ఏట్సుగారు ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్సుగా 1906 లో పర్లాకిమిడివచ్చి గిడుగువారితో బోధనాపద్ధతులను గురించి చర్చించేరు; దైనందిన జీవితంతో ప్రసక్తిలేని భాషలోనూ, బోధనా పద్ధతులలోనూ, తీవ్రమైన మార్పులురావాలని రామమూర్తిగారితో చర్చించి ఒక నిశ్చయానికి వచ్చేరు.

1. చూ. కన్యాశుల్కం రెండవకూర్పు పీఠిక.
2. ,, ,,

మాట్లాడేభాష, రాసేభాష వేరువేరుగావుండడం సారస్వతాభివృద్ధికి పెద్ద ఆటంకం కాకతప్పదు. ఉగ్గుపాలతో నేర్చుకొనే నిజమైన మాతృభాష వ్యవహారికభాషను మూలపెట్టి, గ్రంథాల్లో జీవించే కృత్రిమభాషతో సారస్వతరచన సాగించడం శోచనీయంగా కనపడింది.

వాడుకభాషనుకూడా వ్యాకరణసమ్మతమైనదిగా చేయవలసిందని గిడుగు రామమూర్తిగారు వాదించేరు. వీరేశలింగంగారు రామమూర్తిగారి సహకారంతో వ్యవహారికభాషకొక వ్యాకరణాన్ని రాయడానికికూడా సిద్ధపడ్డారు. సుప్రసిద్ధ విద్యావేత్త రామానుజాచారిగారు పోలవరం జమిందారుగారు మొదలైన పండితులు వాడుకలోలేని పదాలను నవ్యసారస్వతంనుంచి తొలగించాలని వాదించేరు. 1914 సం వరకూ వ్యవహారికభాషా సిద్ధాంతం ఒక ఆశయంగా మాత్రమే వుంది.

తరువాత పి. టి. శ్రీనివాసయ్యంగారు 'లైఫ్ ఆర్ డెత్—ఎ ప్లీ ఫర్ వెర్నాకులర్స్' * అన్న పుస్తకంలో సులభమైన వ్యవహారికశైలిని యెక్కువగా సారస్వతంలో వుపయోగించవలసిందన్నారు. గ్రాంధిక వ్యవహారిక భాషల మిశ్రమంగా సెట్టి లక్ష్మీనరసింహంగారు తమ 'గ్రీకుపురాణ కథ'లను రాసేరు. 'గ్రీకుపురాణకథలు' యస్. యస్. యల్. సి పరీక్షకు పాఠ్య పుస్తకంగా పెట్టబడింది. ఇది పండితలోకంలో పెద్దతుపాను రేగగొట్టింది; ఆందోళన చెయ్యడంతోబాటు మంత్రతంత్రాలనుకూడా చేసేరు. పలుకుబడిగల పదవులలోవున్నకొందరు వారిపక్షం అవలంబించి 'గ్రీకుపురాణకథలను' పాఠ్యపుస్తకాలనుండి తప్పించివేయగల్గేరు. ఏదో ఒక అభిప్రాయంగా, ఆశయంగా, ప్రారంభమైన వ్యవహారికభాష ఒక కార్యక్రమంగల మహా ఉద్యమంగా అభివృద్ధికాసాగింది కిళాంబి రామానుజాచారిగారి అధ్యక్షత క్రింద విజయనగరంలో ఏర్పడ్డ ఆంధ్రసాహిత్యసంఘం, ఆధునిక విజ్ఞాన ప్రచారం వ్యవహారిక భాషద్వారా జరగాలని ఆందోళన చెయ్యసాగింది.

పిఠాపురం మహారాజావారి ఔదార్యంతోను, జయంతి రామయ్య పంతులుగారి నాయకత్వంతోను, వ్యవహారికభాషా వ్యతిరేకోద్యమం తీవ్రత దాల్చింది. సభల్లోను, పత్రికల్లోను, మహజర్లతోను ఆందోళన ప్రారంభించేరు.

విద్యార్థులకు అనువైన శైలి నిరూపించమని మద్రాసు విశ్వవిద్యాలయం ఒక కమిషనును ఏర్పరచింది. భాషాశైలినిచర్చించి నిర్ణయించడానికి

* 'Life or Death - a plea for Vernaculars'

తెలుగుదేశంలో చాలచోట్ల సభలు జరిగేయి. సర్. బయ్యా నృసింహేశ్వర శర్మగారి నాయకత్వంకింద, వ్యవహారికభాషకు వ్యతిరేకంగాను పద్య శృంగార ప్రబంధ ప్రచురణకు అనుకూలంగాను డిప్యుటేషను పంపడానికి ప్రయత్నాలు జరిగేయి.

ఈ ఉద్యమంలో గిడుగు రామమూర్తిగారు పడిన శ్రమ, చూపిన ప్రతిభ తెలుగుజాతి గర్వించదగ్గది. బరంపురం మొదలు చెన్నపట్నం వరకూ వ్యయప్రయాసాలను లెక్కించక ఆయన సంచారంచేసేరు. భాషాశ్ర వాన్ని మధించి, ఛాందసదృక్పథాన్ని బట్టబయలుచేసి, తమవాదాన్ని నిరూపించుకోగలిగేరు. ఈ సందర్భంలో ఆయనరాసిన 'Memorandum on Modern Telugu' 'నిజమైన సాంప్రదాయము', 'ప్రాదెనుగు గద్య' మొదలైన రచనలు ఆయన ప్రతిభను ప్రదర్శిస్తాయి. *

ఇంతకుపూర్వమే దుర్గ్రాహ్యమైన కొక్కొండ వెంకటరత్నంగారి ప్రబంధశైలికీ, ప్రజలకు సుబోధకమైన కందుకూరి వీరేశలింగంగారి సులభ శైలికీ, భీషణమైన పోరాటం జరిగింది. వ్యవహారికభాషాశయమైన సులభ శైలి తరఫున వీరేశలింగంగారు నాయకత్వం వహించేరు. తరువాత వ్యవహారికభాషా ప్రవర్తకసమాజం అధ్యక్షత నంగీకరించి వీరేశలింగం గారు. వ్యవహారికభాషా ఉద్యమంతో ఏకీభవించి, దానికి నైతికబలాన్ని చేకూర్చేరు.

ఈ సంఘర్షణలో గ్రాంధికభాషాపక్షం గెలిచివున్నట్టయితే తెలుగు సారస్వతం కొన్నితరాలు వెనక్కివెళ్ళవలసివచ్చేది. విద్యావ్యాప్తికి పెద్ద ఆటంకం కలిగివుండేది. ఈనాడు ప్రజల్లోనికి చొచ్చుకుపోతున్న తెలుగు సారస్వతం పండితుల జనానాలో బంధించబడి వుండవలసివచ్చేది. కాని వీరేశలింగం, గిడుగు రామమూర్తి, అప్పారాయ మహాకవివంటి యోధుల పరాక్రమంవల్ల మన తెలుగుభాష ఆదుస్థితినుండి తప్పించుకుంది.

---

* చూ. 'వ్యాససంగ్రహం'లో బుర్రా శేషగిరిరావుగారి వ్యాసం—

"And the permanent contribution made by him (గిడుగువారు) to this great urge for democratic self-expression in Andhra literature entitles him to the greatest veneration of the Andhra youth, as the great literary enfranchiser, in some respects even greater, because less compromising than his great leader Veeresalingam pantulu, the maker of Modern Andhra life and literature."

వ్యవహారికభాషను వీరేశలింగంగారు ప్రహసనరచనకు మాత్రమే వినియోగించేరు. ఆయననుండి అప్పారావుగారు, రామమూర్తిగారు నైతిక దీక్షను అలవర్చుకొని, తెలుగుసంస్కృతిని పెంపొందించడానికి వ్యవహారిక భాషను వినియోగించేరు. వీరేశలింగంగారు వుంచిన ఆకాస్త ముసుగును కూడా తొలగించి, వ్యవహారికభాషకు గౌరవమైనస్థానాన్ని సంపాదించడానికి పూనుకున్నారు.

"నాది ప్రజల ఉద్యమము దానిని ఎవరిని సంతోషపెట్టడానికైనా వదులుకోలేను." అని తమ ఆదర్శాన్ని 1911 మార్చి 27 వ తేదీని అప్పారాయ మహాకవి తమ డైరీలో రాసుకున్నారు. వ్యవహారికభాషా ప్రయోజనాలు అశేషమైనవనీ, వ్యవహారికభాష రైతులకళ్ళు తెరుస్తుందనీ, భారతదేశంలోవున్న ఇంగ్లీషువారికళ్ళుకూడా తెరుస్తుందనీ, కన్యాశుల్కం రెండవకూర్పు పీఠికలో అప్పారావుగారు రాసేరు. ప్రజల ఉద్యమమని యీనాడు రుజువైన వ్యవహారికభాషా ఉద్యమస్వభావాన్ని అర్ధశతాబ్దంక్రితం స్పష్టంగా చెప్పగలిగిన ఆలోచనాపరుడు అప్పారావుగారు! ఆమహోద్యమాన్ని 'ఎవరిని సంతోషపెట్టడానికైనా వదులుకోలేని' దీక్షాపరుడైన ప్రజాభిమాని అప్పారావుగారు!

ఆనాడు వ్యవహారికభాషను చేపట్టడమంటే ఏటికి ఎదురీతవంటిది. ప్రబలులైన పండితులతో ఢీకోవడమన్నమాట. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి, శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి, వావిలకొలను సుబ్బారావు, భోగరాజు నారాయణమూర్తివంటివారు నీచంగా తూలనాడుతున్నా, అప్పారావుగారు తాను రెచ్చిపోయి వారిస్థాయికి దిగకుండా, తమసహజసౌమ్యతతో ప్రతికక్షులకు నొప్పికలిగించని విధంగా జవాబులిచ్చేవారు. వ్యవహారికాన్ని దూషించడానికి రాసిన వారి భాషలోనే దోషాలను చూపి, గ్రాంధికభాషలో అటువంటి పండితులుసైతం తప్పుల తడకలు రాస్తున్నప్పుడు సామాన్యులమాటేటని ప్రశ్నించేవారు.

"గ్రాంధికభాషలో రాయడమన్నది గరిడీవిద్య. భగవంతుడు కాళ్ళు యిచ్చినందుకు సుఖంగా నడవక గెడలెక్కుదురు; యేమిచెయ్యను?"

"శిష్టులు రాత్రీపగలూ వాడుకచేసే భాషను గ్రామ్యమనడము అనాలోచితమనుకుంటాను. అదే గ్రామ్యమౌట నిజమైతే, యిప్పటి గ్రంథకర్త అంతా గ్రామ్యజనమే![1]"

1. చూ. "మాటా - మంతీ"లో అప్పారావుగారి వ్యాసాలు.

ఇటువంటివి ఆనాటి యుద్ధాలలో అప్పారాయ మహాకవి ప్రయోగించిన అస్త్రాలు. సబబూ సందర్భమూ లేకండా శాస్త్రప్రమాణాలవేపు పరుగులెత్తేవారిని అప్పారావుగారు 'లవణరాజుకల'లో యీవిధంగా వర్ణించేరు :

"పుస్తకంబులలోని మాటలు
విస్తరించుచు, ననుభవమ్ముల
తత్వమెఱుగక, ఘకములగుదురు
వొట్టి శాస్త్రజ్ఞుల్ !"

తమ పరమమిత్రులైన గిడుగురామమూర్తిగారితో కలిసి వీరిని చివరివరకు ఎదిరించి పోరాడి తమ ఆదర్శాన్ని అప్పారావుగారు స్థాపించుకోగల్గేరు.

ఈసందర్భంలోనే అప్పారావుగారికి రవీంద్రనాథటాగూరుగారికీ ఉత్తరప్రత్యుత్తరాలు నడిచేయి. అప్పారావుగారు వ్యవహారికభాషను బలపర్చడం ఆయనకు గ్రాంధికభాషలో రాయడంచేత కాకపోవడంవల్లనే అని కొందరు పండితులు ఆక్షేపించేవారు. ఆ కుంటివాదాన్ని ఎదుర్కోవడానికి 'సుభద్ర' అన్న పద్య కావ్యాన్ని 1913 లో ప్రబంధశైలిని ప్రశంసనీయంగా రాసి, పండితుల కుంటివాదానికి యింకొక దెబ్బకొట్టేరు.

విశ్వవిద్యాలయం శైలిని నిర్ణయించేనిమిత్తం ఒక సంఘాన్ని ఏర్పాటుచేసింది. అందులో అప్పారావుగారుకూడా ఒక సభ్యులు. గ్రాంధికవాదుల ప్రాబల్యంగల ఆ సంఘం వ్యవహారికభాషకు వ్యతిరేకంగా నిర్ణయం చేసింది. అప్పారావుగారు ఆనిర్ణయానికి అసమ్మతి తెలియజేస్తూ భాషాచర్చమీద చక్కని వ్యాసాన్ని 1914 లో రాసేరు.[1] ఇది భాషావిషయమై అప్పారావుగారు చేసిన కృషిని తెలియజేస్తుంది.

క్రమేపీ వ్యవహారికభాషను ఎదిరించిన వారొకొక్కరూ వ్యవహారికభాష పక్షానికి రావడమో, తటస్థంగా వూరుకోవడమో, తమ వాదంలో బలంలేదని తేలిపోయినప్పటికీ మొండిగా వాదించడమో చెయ్యసాగేరు. వ్యవహారికభాషను 'గ్రామ్య'మనీ 'కులట'అనీ 'లంజసంతతి'అనీ సబబు తప్పి, తిట్టిన భోగరాజు నారాయణమూర్తివంటివారుకూడా "చిన్నయసూరి సూత్రముల జిక్కి-కృశించి విషాదమొందుతూవున్న తెనుంగు, శృంఖలము

1. 'The Minute of Dissent to the Report of the Telugu Composition Sub-committee'

లాడి, సుఖంబుగ మేడ మెదగూర్చున్నది; నూత్నకాంతిగనుచున్నది; హాయిగ నేడు సంచరిస్తున్నది...." [1] అని మెచ్చుకొని వ్యావహారికంలో వృత్తాలు కూడా రాశేరు.

వాడుకభాషలో వచనమేకాకుండా గీతాలుకూడా రాసి, అప్పారాయ మహాకవి దాని మాధుర్యాన్ని తెలుగువారికి పంచిపెట్టేరు. ఈనాడు యిన్ని పత్రికలు, యింతమంది రచయితలూ, పాఠకులూ వున్నారంటే, గిడుగు వారి పాండిత్యంతోపాటు అప్పారావుగారి చలువే కారణమని చెప్ప నక్కరలేదు.

## ఉ త్త మ క ళా వే త్త:

"యుగయుగంబులనుండి మోగ్రెడు
విశ్వగాన వియత్తరంగిణి
భంగముల నుప్పొంగు నాతని
గీతశీకరముల్" 2

ఊహాపూరితమైన కళాసృష్టికంటె, జీవితదృశ్యాల్ని, సమస్యల్ని కళారూపాల్లో పెట్టడానికి, కళాకారుడికి మానవజీవితాన్ని పరిపాలిస్తున్న వివిధ శక్తుల విషయపరిజ్ఞానం విశేషంగావుంటేనేగాని సాధ్యంకాదు. ఇది 'కళ కళకోసమే' అన్న సిద్ధాంతంగల రచయితకు అనవసరం. ఇతర హంగులకోసం యితను తాపత్రయపడతాడుగాని, జీవితంతోను జీవితంపై ప్రభుత్వం చేస్తున్న యితరశక్తులతోను జోక్యం కలుగజేసుకోడు. కళ కళ కోసమే అని ప్రాకులాడి జీవితానికి వెన్నుచూపని కళాకారుడు వీటిని హృదయస్థంచేసుకోవడమేకాకండా, కళారూపాల్లో వెల్లడించాలి. అందుచే తనే యితనిపని చాలకష్టమైనది. అట్టి ఎగుడుపనికి పూనుకొని సమర్థతతో నిర్వహించి తెలుగు సాహిత్యంలో విప్లవకరమైన మార్పులుతెచ్చిన మహా కవి అప్పారావుగారు.

"ఆకులందున అణగి మణగీ
కవితకోకిల పలుకవలెనోయి
పలుకులనువిని దేశమందభి
మానములు మొలకెత్తవలెనోయి."

---

1 చూ. 'వ్యాసపంగ్రహం' – సంపాదకుడు, తెలికిచర్ల వెంకటరత్నంగారు
2 దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు.

బాహ్యాడంబరంలేని ఉన్నతహృదయంలాగ అప్పారాయమహాకవి పాడిన యీగేయం, ఆదర్శ సాహిత్యమేదో తెలియజేస్తాంది.

కవిత కోకిలపలుకులు దేశమందభిమానములు మొలకెత్తించాలి.

అప్పారావుగారు మనకిచ్చిన కవితాదర్శంయిది.

"మేలిమిబంగరు మెలతల్లారా!
కలువల కన్నుల కన్నెల్లారా!
తల్లులగన్నా పిల్లల్లారా!
విన్నారమ్మా యీకథను.

ఆటలపాటల పేటికలారా!
కమ్మనిమాటల కొమ్మల్లారా!
అమ్మలగన్నా అమ్మల్లారా!
వినరమ్మా మీరీ కథను"

పై రెండుపాటలు అప్పారాయ మహాకవి పద్యకథానిక 'పూర్ణమ్మ' లోనివి; ఆడపిల్లలకోసం రాయబడినవి. రాళ్ళను కరిగించే విషాదగాథ.

"పళ్ళనుమీరిన తీపులనడలను
పువ్వులమీరిన పోడుములున్
అంగములందున అమరెను పూర్ణకు
సొరులుమించెన్ నానాటన్."

ఈ పుత్తడిబొమ్మ పూర్ణమ్మను 'కాసుకులోనై తల్లీ తండ్రీ నెనరూ న్యాయం విడనాడి' కాటికికాళ్ళు చాచుకున్న ముసలివానికి ముడివేస్తారు.

"ఆమనిరాగా దుర్గకొలనులో
కలకలనవ్వెను తామరలు;
ఆమనిరాగా దుర్గవనములో
కిలకిలపలికెను కీరములు"

కాని పూర్ణమ్మ ఎలాగవుంది?

"ముద్దునగవులూ మురిపెంబు మరి
పెనిమిటిగాంచిన నిమిషమున
బాసెను కన్నియ ముఖకమలమ్మున
కన్నులగ్రమ్మెను కన్నీరు."

కొన్నాళ్ళకు భర్త తీసుకవెళ్ళడానికొచ్చేడు. పూర్ణమ్మను సాగనంప డానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. పూర్ణమ్మకూడా సిద్ధమయింది — భర్తయింటికిమాత్రంకాదు - యింకోచోటికి.

"పెద్దలకప్పడు మొక్కెను పూర్ణమ
తల్లీ తండ్రీ దీవించి;"

కాసుకులోనై తనబతుకు బద్దలుచేసిన తల్లిదండ్రులు దీవించేరు:

"దీవనవింటూ పక్కున నవ్వెను
పుత్తడిబొమ్మా పూర్ణమ్మా!"

హిందూసంఘమంతా దద్ధరిల్లవలసిన నవ్వునవ్వింది. పూర్ణమ్మ సెలవు - తుదిసెలవు - తీసుకుంటూంది:

"నలుగురు కూచుని నవ్వేవేళల
నాపేరొకతరి తలవండి;
మీమీ కన్నబిడ్డల నొకతెకు
ప్రేమను నాపేరివ్వండి."

"బలబల కన్నుల కన్నీరొలికెను
పుత్తడిబొమ్మకు పూర్ణమకు"

ఒక్క పూర్ణమకేకాదు. బంధువులందరితోబాటు పాఠకులుకూడా 'బలబల కన్నీరు' కార్చుతారు. తల్లికూడా కంట తడిపెడుతుంది. కాని

"కాసుకులోనై అల్లుని తలుచుకు
ఆనందించెను అమ్మొకడె."

పూర్ణమ్మ దుర్గపూజకు వెళ్ళిపోయింది.

"ఆవులు పెయ్యలు మందలజేరెను
పిట్టలు చెట్లను గుమిగూడెన్;
మింటను చుక్కలు మెరయుచు పొడమెను
పూర్ణమ యింటికిరాదాయె.

చీకటివిండెను కొండలకోనల
మేతకు మెకములు మెసలజనెన్."

కాని పూర్ణమ్మ యింటికితిరిగిరాలేదు. పూర్ణమ్మఏమయిపోయింది?

"కన్నుల కాంతులు కలువలచేరెను
మేలిమిజేరెను మేనిపసల్
హంసలజేరెను నడకలజెడగులు
దుర్గను జేరెను పూర్ణమ్మ."

ఈ కన్నీటి కథ సమాప్తమయింది ఈ కావ్యంలోని ఒకొక్క అక్షరం మహాకవి అప్పారావుగారు ఒకొక్క కన్నీటి సుక్కతో చెక్కినది. ఈ కావ్యంలో, 'బలబల కన్నీ'రోడుతూ, పాఠకునికి మహాకవికూడా కనిపిస్తాడు. 'కన్యాశుల్కం'లో లోపించిన శోకరసం 'పూర్ణమ్మ'లో ప్రత్యక్షమవుతుంది.

'పూర్ణమ్మ' నిరాడంబరమైన కావ్యం. సాంప్రదాయసిద్ధంగా కావ్య శిల్పాన్ని గుత్తగొన్న కృత్రిమత్వం, మహాకవి యితరరచనలలోలాగనే, యిందులో వెలివేయబడింది. నిరాడంబరమైన, జాతీయమైన సౌందర్యం యీకావ్యంలో తొణికిసలాడుతుంది. అది అప్పారాయమహాకవి ప్రత్యేకత, విశిష్టత.

అందుచేతనే, జీవితాన్ని వదులుకొని కళలంటే మేఘాలమీద పునాదులువేసి కట్టిన గాలిమేడలనుకొనే కృత్రిమజీవులను

"కొయ్యబొమ్మలె మెచ్చుకళ్ళకు
కోమలుల సౌరెక్కునా?"

అని ప్రశ్నిస్తున్నారు మహాకవి.

తండ్రి ధనాశకూ, పుస్తెకట్టిన ముసలివాడి కసాయితనానికీ పూర్ణమ్మ బలిఅయిపోయినట్టే. 'కన్యక' కావ్యంలో రాజు మదాంధతకు కన్యక బలి అయిపోతుంది.

"తగటు బంగరుచీరెకట్టి
కురుల పువ్వులసరులుజుట్టి
నుదుట కుంకుమబొట్టుపెట్టి
సొంపు పెంపారన్.

తొగలకాంతుల కనులుపరపగ
మించుతళుకులు నగలునెరపగ
నడక లంచకు నడలుకరపగ"

దేవాలయానికి వెళ్తున్న కన్యకకు ఆవూరు రాజు ఎదురై, 'కన్నె సొగసుకు కన్నుచెదురై, మరునివాడికి గుండెబెదురై'

"జాౌరచుక్కల నడుమచందురు
నట్లు వెలిగెడు కన్నెముందర,
వన్నెకాంచిన నగరిసుందరు
లందరొకలెక్క ?
పట్టవలెరా దీనిబలిమిని
కొట్టవలెరా మరునిరాజ్యం
కట్టవలెరా గండపెండెం
రసిక మండలిలో"

అని తలపోస్తూ కన్యకను పట్టుకోవడానికి ప్రయత్నిస్తాడు. కన్యక సమయస్ఫూర్తితో

"ముట్టబోకుడు దైవకార్యం
తీర్చివచ్చెద, నీవుపట్ణం
యేలురాజువు, సెట్టికూతుర,
వెటకు పోనేర్తున్"

అని తాత్కాలికంగా తప్పించుకొంటుంది. కన్యక తండ్రి, బంధువులు వస్తారు. కన్యకను అగ్నిసాక్షిగా వివాహంచేసుకోవలసిందని తండ్రి రాజుకు విన్నవించుకుంటాడు. రాజు తృణీకారపు నవ్వునవ్వి

"....ఓహో ! ధర్మమార్గం
పట్టమేలే రాచబిడ్డకు
పెట్టి కరపడమా !
రాజుతలచిందేను ధర్మం
రాజుచెప్పిందెల్ల శాస్త్రం
రాజులకు పేరైనపద్ధతి
కాద, గాంధర్వం ?"

అని తన నిరంకుశత్వాన్ని ప్రకటిస్తాడు. తన రాక్షసత్వాన్ని గాంధర్వం అని కప్పిపుచ్చబోతాడు.

"దేగ. పిట్టనుపట్టి విడుచున ?
కన్నె, యింటికి మరలి నడచున ?"

అంటూ తన నిర్ణయాన్ని తెలియజేస్తాడు దైవకార్యం అపేక్షిత తమచిత్తం అని కన్యక తండ్రి గిరిప్ప ఒప్పుకుంటాడు.

కన్యక రాజుకు పాఠంచెప్పి తనమానాన్ని రక్షించుకోవడానికి నిశ్చయించుకుంటుంది.

"పట్టమేలే రాజుఅయితే
రాజునేలే దైవముండడొ ?
పరువునిలపను పౌరుషము మీ
కేల కలుగదొకొ ?"

అని అక్కడ గుమిగూడిన వారిని హెచ్చరిస్తుంది.

"....కాసువీసం
కలిగివుంటే చాలుననుకొని,
వీర్యమెరుగక, విద్యనేర్వక,
బుద్ధిమాలినచో
కలగవాయిక్కట్లు ? మేల్కొని,
బుద్ధిబలమును బాహుబలమును"

పెంపొందించుకొని స్వరక్షణచేసుకోవడమే కాకండా సంఘంలో తగిన స్థానం సంపాదించుకోవలసిందని వైశ్యకులాన్ని ప్రబోధిస్తుంది. అవమానానికి గురిఅయిన కన్యక స్త్రీ సహజమైన ధోరణిలో, కామాంధుడైన రాజును సంబోధిస్తుంది.

"పట్టపగలే నట్టివీధిని
పట్టి బోరే జారచోరులు
పట్టదలచితివింక నీవొక
పట్టమేలే రాజువట !
కండకావరమెక్కి నీవీ
దుండగము తలపెట్టినందుకు
వుండదా ఒకదైవమంటూ,
వుండి వూర్కొనునా ?"

అని అంటూ కన్యక రాజును సవాలుచేసి మంటలోనికి దుముకుతుంది. దాంతో 'పట్టమేలే రాజుగర్వం మట్టిగలిసెను' !

వైష్ణవుల కులదేవత అయిన కన్యకాపరమేశ్వరికథను యితివృత్తంగా తీసుకొని అప్పారాయ మహాకవి అతిగంభీరమైన కావ్యాన్ని అల్లేరు. కండకావరమెక్కి ఉండగించేసే దుర్మార్గుడైనరాజు. లావణ్యవతి మానాభిమానవతి అయిన కన్యక, రాజు దౌష్ట్యాలకు అలవాటుపడి అణగి మణగి వుండే తండ్రీ, అనన్యసామాన్యంగా చిత్రించబడ్డారు.

ఇరవయ్యో శతాబ్ది మధ్యభాగంలోవున్న యీ రోజుల్లోకూడా యిటువంటిదుర్మార్గాలుజరగకపోలేదు. స్వదేశసంస్థానాలనుండీ, జమీందారీలనుంచీ, అప్పుడప్పుడిటువంటి వార్తలు వస్తూనేవున్నాయి. కాగా, సాంఘికమైన యింకొకవిషాదాన్ని, అప్పారాయ మహాకవి యీకావ్యంలో చూపెట్టేరు.

నానావర్ణ సహపంక్తి భోజనంలో పాల్గొని యింటికివచ్చిన భర్త భార్య పడ్డ ఆందోళనకు ఎలాగ కారకుడయ్యేడో, 'ముత్యాలసరములు' అన్న పద్యకథానికలో అప్పారావుగారు చూపెట్టేరు. ఈ సహపంక్తి భోజనం సనాతన కుటుంబంలో యెటువంటి ఫలితాల్ని యిచ్చిందో మహాకవి స్త్రీ నోటితో చెప్పిస్తున్నారు. ఇటువంటి స్త్రీ ప్రతి సామాన్యకుటుంబంలోనూ వుంటుంది,

> "వింటి మీ పోకిళ్లు వింటిని,
> కంటనిద్దుర కానకుంటిని;
> యీచిన్నమనసును చిన్నబుచ్చుట
> యెన్నికని యోచించిరో ?"

ఆవిణ్ణి తోటికోడలుదెప్పింది; సానుభూతిచూపి సాటివారోదార్చేరు. ఇవ్వన్నీ సహించింది. కాని

> "మాటలాడక చూచినవ్వెడి
> మగువ కేమందున్"

అని బాధగా భర్తనడుగుతూంది. భావాలు పరిపరివిధాల పరుగెడుతున్నాయి.

> "తోడుదొంగని అత్తగారికి
> తోచెనేమో యనుచుగుండిలి:
> కొలగతియని మామలెంతో
> కలగ సిగ్గరినై."

అక్కడితో ఆగక, భర్తకు ప్రేమతో చీవాట్లుపెట్టడానికి ప్రారంభిం చింది. ఇంగ్లీషుచదువే యీ మార్పు తెచ్చిందని—

"చాలునహా! మీ చాకచక్యము
*చదువుకిదె కాబోలు ఫలితము
ఇంతయగునని పెద్దలెరిగిన
యింగిలీషులు చెప్పుదురా?

"కోటపేటలు నేలగలరని
కోటివిద్యలు మీకు కరపిరి;
పొట్టకూటికి నేర్పువిద్యలు
పుట్టకీట్లు కదల్చెనా?"

కట్టుకున్న తనమాటెలాగున్నా, కనిపెంచిన తలితండ్రుల ముఖ మైనా చూడవద్దా అని ప్రశ్నిస్తుంది. శృతి యింకాకొంచం యెక్కువచేసి—

"కలిసిమెలసిన యంతమాత్రనె
కలుగబోదీ యైకమత్యము;
మాలమాదిగ కన్నెనెవతెనొ
మరులుకొనరాదొ?"

అని భర్తకొక అమోఘమైన సలహానిస్తుంది. కోపం ఆపలేక, సంస్కరణప్రియుడైన భర్తమనసు వికలముచేసి వెళ్ళిపోతుంది. కవి యీవిడమీద మనకు కోపాన్ని తెప్పించడు. వర్ణధర్మాల్లో కూరుకపోయి వున్న ఒక స్త్రీనిచూపి జాలి రేకెత్తిస్తాడు.

ఇంతలో 'తూర్పు బల్లున తెల్ల'వారుతుంది. ఆదర్శప్రియుడైన భర్త 'లోకమందలి మంచిచెడ్డలు లోకులెరుగుదురా?' అన్న సందిగ్ధంలో వుంటూండగా కథ సమాప్తమవుతుంది.

ఆభరణాలమీద ఆపేక్ష వుండడం స్త్రీలకు సహజం. ఆభరణాలు చెయ్యించితెమ్మని భర్తను అడిగిఅడిగి, విసిగిపోయి, భార్య అలుగుతుంది. 'కాసులు' అన్న ఖండకావ్యంలో (మోనొలాగ్) స్త్రీకి నిజమైన ఆభరణా

* "చదువువారికి వెర్రిబ్రాంతులు
మెదడు కెక్కిన పాయవందుర"
('డామన్ పితియస్')

ప్రేమతో విద్యావంతుడైన భర్తచేత చెప్పించి, భార్య అలకను తీర్పిస్తాడు మహాకవి.

"ధనములు రెండు తెరగులు;
ఒకటి మట్టిని పుట్టినట్టిది; వే
రొకటి హృత్కమలంపు సౌరభ
మడియు నిది యొక్కడను కలుగుట యరుదు"

ఈ రెంటిలో స్త్రీ వాంఛించవలసినదేది అని అడుగుతాడు భర్త. ధనమంటే 'హృత్కమలంపు సౌరభ'మని భర్త నిర్వచనం; భార్యకు ధనమంటే బంగారం.

బంగారం స్త్రీలకు అందమిస్తుందని లోకంలోవున్న అభిప్రాయాన్ని ఒప్పుకున్నప్పటికీ, ప్రేమలేని అందం వాసనలేని మంకెనపువ్వు అందం వంటిది.

"..................తీవలకు
తవిరులతెరంగున, కాంచనము
సింగారమందురు లలనలకు;
కానిమ్ము; గాని, కమ్మనితావి
గమ్మెడి పుష్పనిచయము ప్రేమ
కా? అదిలేక మంకెన కెంపు
కాంతల యందము."

"......................ప్రేమ
పెన్నిధిగాని, యింటను నేర్ప
రీకళ, ఒజ్జలెవ్వరులేరు
శాస్త్రము లిందుగూరిచి తాల్చె
మౌనము * నేను నేర్చితి భాగ్య
వశమున, కవుల కృపగని, హృదయ

---

* "విద్యయందలి మాయమర్మము
దిద్ది చెప్పిందబల యొక్కతె
విద్యలెరుగని ప్రేమభరమును
వింతగా చూపెన్"

('డామన్ పితియస్')

మెల్లన నించినావీవు ప్రేమ
యను రతనాల.... ...."

వాటినే ఆభరణాలుగా గ్రహించి అలంకరించుకో మంటాడు.

"............సతుల సొగసు
కమలవనముకు పతుల ప్రేమయె
వేవెలుగు; ప్రేమ కలుగక బ్రతుకు చీకటి"

ప్రేమ ఎటువంటిది? మరులా ప్రేమా ఒకటేనా అన్న ప్రశ్నలకు

"మరులు ప్రేమని మది దలంపకు;
మరులు మరలును వయసుతోడనె;
మాయమర్మములేని నేస్తము
మగువలకు మగవారి కొక్కడే
బ్రతుకు సుకముకు రాజమార్గము—
ప్రేమనిచ్చిన, ప్రేమవచ్చును—
ప్రేమనిలిపిన ప్రేమనిలుచును."

ఈ ఖండకావ్యం మన నవ్యసాహిత్యంలోని ప్రేమసాహిత్యానికి 'ఓనమాలు'. కాని యీ ఒరవడి రాలేదు; అంతేకాకుండా వెనకకు నడుచుకొంటూ ప్రబంధ సాహిత్యంవేపు దారితీసింది.

ఈ సందర్భంలో అప్పారాయమహాకవిచేసిన స్త్రీ సౌందర్యవర్ణనను ఒకసారి చూడవలసివుంది.

"అరమొగిడ్చిన కన్నుగవతో,
చెదరియాడెడి ముంగురులతో,
బెదురుయెరగని బింకమొప్పిన
బెడగు నడకలతో,

కూటికడవను బుజముపైనిడు
వాటమదియొక మురువుగులకగ
పాటపాడెను, పాటలాధరి
చెట్లుచేమలకై.

తెలివియొలికెడి తేటకన్నులు
మురువుగులికెడు ముద్దుమోమును

వేల్పుచేడియలైన నేఁటని
గానమాధురియున్"

('లవణరాజు కల')

"తగటు బంగరు చీరెకట్టి
కురులపువ్వుల సరులుజుట్టి
నుదుట కుంకుమబొట్టుపెట్టి
సొంపు పెంపారన్;

తొగలకాంతులు కనులుపరసగ
మించు తళుకులు నగలు నెరపగ
నడకలంచకు నడలుకరపగ
కన్నెపరతెంచెన్"

('కన్యక')

"పళ్ళనుమీరిన తీపులనడలను
పువ్వులమీరిన పోడుములున్
అంగములందున అమరెను పూర్ణకు
సొరులుమించెను నానాటన్"

('పూర్ణమ్మ')

అప్పారాయమహాకవి స్త్రీని వర్ణించి, తను రెచ్చిపోయి చదివే వాళ్ళను రెచ్చగొట్టలేదు. ఆయన కొయ్యబొమ్మలను సృష్టించలేదు. కోమలిని మాత్రం వర్ణించేరు.

అప్పారాయ మహాకవి చేసిన శృంగార వర్ణనలు ఉత్తమజాతికి చెందినవి. "పచ్చి" లేనిశృంగారంలోని వివిధ రూపాలను మహాకవి చక్కగా చిత్రించారు. "నాటిమాట" అన్నపాటలో మోసగింపబడిన స్త్రీ, ప్రియుణ్ని ఉద్దేసించి అనిన మాటలలో యెంతచక్కటి వ్యంగం వుందో గమనించండి.

ప్రియుడు విరహిణిని తన "ప్రాణ" మని చెప్పేడు. తన్ను "ముమ్మాటికి" విడననని అన్నాడు. ఆ "మాటను మూటకట్టుకొని" నేరం ప్రియునిదే అనడం తనపొరపాటేనని ఒప్పుకుంటుంది. "మాటన నేపాటిర నీసాటిదొరకు" అనీ, బ్రతుకే స్థిరంకానప్పుడు మాటమట్టుకు స్థిరమా అనీ మాటతప్పిన ప్రియుణ్ని యెత్తిపొడుస్తుంది. వేషభాషల బూటకాలను

నమ్మి మోసపోయే ఆడవాళ్ళదే తప్పని తన్ను తాను నిందించుకుంటుంది. "సాటిలేరు" అని తన్ను పొంగించిన ప్రియుడిమాట నిజమేనని సమర్థిస్తుంది. "నమ్మి భంగపాటుపడి పడతికెందు" "సాటికలదె?" అని ప్రియుడి గుండెలు కరిగించేప్రశ్న వేస్తుంది. ఇప్పుడయినా ఒక్కసారివచ్చి అనుగ్రహించమంటుంది! అతని దగామాటనే "కోటిధనములిచ్చి కొందు" నంటుంది: *

---

* సంగీతాభిలాషులకొరకు స్వరాలతోపాటు పాటంతా యివ్వబడింది:

నాటిమాట

అఠానా - రూపకం

పల్లవి

నాటిమాట మరచుటయే
నాటికైన మరువవశమ ॥

అనుపల్లవి

కోటిప్రాణమీవంటి, ము
మ్మాటికి నిను విడనంటి ॥

చరణములు

1. మాట మూటగట్టుకొని
పాటిదప్పితనుట నా పాల
పాటుగాగ, మాటననే
పాటిర నీసాటిదొరకు ॥

2. బ్రతుకునందు లేని స్థిరత
వెతకనేల భాషయందు
నటుకు వేషభాష కోకు
నతివలదే తప్పుగాక ॥

3. సాటిలేదు నాకంటివా
మాటనిజము నేడుగంటి
సాటికలదె నమ్మి భంగ
పాటుపడిన పడతికెందు ॥

పల్లవి

గామపాపనిపనిపధా - నిసరీసనిసధాధపమప

అనుపల్లవి

నిసగారిస - సరిసనిధానిస
పనిసరిసరిసనిపాప - పానిధపమగమపాప - గామప

"లేవొకో మంత్రములు" అన్నపాటలో "నాటిమాట"లోని విరహిణిలాగ ప్రియుడికి లొంగిపోకుండా యెంత రమ్యంగా మందలిస్తుందో చూడండి :

మంత్రమహిమచేత ప్రియుణ్ని 'లేమగా జేయ'గలిగినట్టయితే, అతనికి అతనిలాంటి ప్రియుడే తటస్థించి బాధించి వుండేవాడనీ, అప్పుడు తనవేదనను ప్రియుడు అర్థం చేసుకోగలిగేవాడనీ అంటుంది. పగతీర్చుకో డానికా పగతీవయ్యేవు అని అడుగుతుంది. *

'చిత్తపవనిచూడ' అన్నపాట సౌందర్యవతిఅయిన స్త్రీ చిత్రపటమును చూసి "చిత్తము" అర్పించిన పురుషుడు పాడినది. తనసర్వస్వమూ ఆ చిత్రపటంలోని సౌందర్యవతికి అర్పిస్తానంటాడు; తన మనస్సు ఆమె వశమైపోయిందని

---

చరణము

పాపపాపగామపప -
ధాదధాధపదనిదపగామప - నిసగారిస -
సరిసనిధానిస - సనిసరిసరిసనిపాప - పానిధపమగా
మపాప - గామప

* లేవొకో మంత్రములు

శంకరాభరణము - ఝంప.

1. లేవొకోమంత్రములు - లేమగా జేయనిను
లావపుడు బయలుపడు నొక్కొ
కావనుచు నీలాటి - కాంతునకు జిక్కినీ
భావమున నలయిక కనుబడుదొ॥

2. మంచియును చెడ్డయును మానమును గనక పటు
వంచనను పరకాంతదగిలి
యించుకయునను లోక - మెంచునని భీతిలక
కొంచతనమూనుటది కోమరొ॥

3. మగడవై పగతీర్చు - పగతుడవుగాక నిది
తగునటర తలపోయకుంట
మిగిలినదిలేదు దికమీద నినునమ్మనా
నగధరుని నమ్మెదనులేరా॥

మగమపాపాపపమగమపమగాగరి - గామపమమగగిరీగమపా
మగమపాధనిసాసనిసరిసధనిసని - పాదనీధపమగరిస॥

"మనసులేనితనువు — మరియేలనేనాకు
చెనటిదీనిగూడ — చేకొనఁగదవె"

అంటాడు. వానికిబదులుగా ఒక్కమాట అనమంటాడు. ఆమె ఒక్క మాటకు, తనమనసూ తనువూ "విలువచాలదన్న" మన్మథునిసాక్షిగా ఆమెపలుకుకోసం "కలుగు జన్మములను కానుకగా" సమర్పిస్తానంటాడు! *

ఈమాట శృంగారపదాలలో, తెలుగుసాహిత్యంలో సాధారణంగా కనుపించని ప్రత్యేకతను మహాకవి కనబర్చేడు. శృంగారం నిజమైన లలితకళగా చిత్రించబడింది.

---

* <u>చిత్తరువనిచూడ</u>

శంకరాభరణము — మిశ్రచాపు

పల్లవి

చిత్తరువని చూడ - చిత్రముగొంటివి
చిత్తజానపరంజి - చిలుక యెవ్వతెవే॥

అనుపల్లవి

వత్తువో నా మ్రోల - వలరాజు వేడిన
మత్తకాశిని నీదు - మనమైన నీగదె॥

చరణములు

1. ఇచ్చిపుచ్చుకొంట - యిలలోనిమర్యాద
ముచ్చిలిమౌనము - మెచ్చుదురటవే
వచ్చిచూచినంత - వంచనజేయుదె
పచ్చిదొంగతనము - పడతిరో పరువె॥

2. మనసులేనితనువు - మరియేలనేనాకు
చెనటిదీనిగూడ - చేకొనఁగదవె
వానికిబదులొక్క - వాక్కునే వేడెద
మానిని యీపాటి - మన్నింపఁజెల్లునె॥

3. విలువచాలదన్న - విరివిల్తుపైనాన
కలుగుజన్మముల - గానుకకొనవె
ఎలమినావందేంద్రు నేలినవెన్నుడు
పలుతెలుగుల మేలు - పడతినీకిచ్చునె॥

పల్లవి

సగామాపధపాప
మధపమగగమపగామరి - మధపాపమగమరిసాసా
సగాగామపరిస -

ఎంతమంది కవులు యిది చెయ్యగలిగేరన్నది ప్రశ్న.

'డామన్ పితియస్' 'లవణరాజు కల' అన్న పద్యకథానికలలో అద్భుతమైన ప్రకృతిదృశ్యాల్ని ప్రదర్శించేరు,

"తదియచంద్రుడు దబ్దిసోకెను
చదలవిడబడి, యిరులుప్రాకెను;
అమనుకాంచిన రిక్కమూకలు
అంతటను ప్రబలెన్.

చారుతరముగ పసిడి పమిదల
బారుతీరి వెలింగె జోతులు;
వారి యంత్రము తళుకు ముత్తైపు
సరులు విరజిమ్మెన్"

('డామన్ పితియస్')

"వెలుగు నీడలు కనులకింపై
మెలగిచెలగెడు నాకసంబున
ప్రేలుమబ్బుల యంచులంటను
రగిలె రత్నరుచుల్.

పాటెపక్షులు పౌజు పౌజుల;
జీరెకోయిలలొకటి నొకటిని;

---

అనుపల్లవి

పమగామాధానిస
నిసరీసనిధపపా
పదదానిసానిధధని
సాసానిధపమదపామగరిస-సా॥

చరణము

మపామపమాగగమరి
గగపామాపమాపప
గమధపమాగరిస
గగామాపధపావమగామాధానిస
నిసరీసనిధనిసా
పదధానిసానిధధని
సాసానిధపమదపామగరిస॥ పా॥

మారిగూడుల వాసలాడెను
పిట్టలెల్లడలెన్.

గగనరాజ్యము గ్రమ్మువేడుక
మగటిమిని తన కళలు నూర్చుచు,
వగలు వెన్నెనవన్ని సోముడు
పైనపై వెదలెన్.

తాడివనములు తూర్పుకొండను
గొడుగులై తైను; చామరంబులు
నిడిపె, జీఱగు బడు గణంబులు
దవ్వులను నిలిచెన్.

చల్లగాలులు సాగి యలుగ
జల్లుజల్లున రాల్చె పూవుల;
ఉల్లమలరెను........"

ఇంతలో నాయకి పాటపాడుతుంది.

"పాటపాడెను, చెట్లుచామలు
కోటిచెవులను గ్రోలియలరగ;
తాటివనమున నాగి చంద్రుడు
తాను చెవియొగ్గెన్"

"....రావికిందను రచ్చశిలపై
కొమ్మలను జేరి చంద్రకాంతులు...."

('లవణరాజుల కల')

ఈ గేయాలను అప్పారాయ మహాకవి, కవిగా రాసేరనేకన్నా చిత్రకారుడుగా రాసేరంటే సమంజసంగా వుంటుంది, వాటి అందచందాలను చెప్పడానికి పూనుకుంటే వాటి అందచందాలను పాడుచెయ్యడ మవుతుందేమో!

ఇదేవిధంగా చక్కటి తత్వధోరణిగలగేయాలు అప్పారాయ మహాకవి కావ్యాల్లో అక్కడక్కడ నక్షత్రాలలాగ కనిపిస్తాయి. తత్వశాస్త్రం అభిమాన విషయంగా అప్పారావుగారు పట్టబద్ధులయ్యేరు. అంతేకాకండా ఆయనకు తత్వశాస్త్రమంటే చాలా ప్రీతివుండేది.

'....నిన్నయన్నదె, నేడు రేపులు....'

"మంచిచెడ్డలు మనుజులందున
యెంచిచూడగ, రెండెకులములు;
మంచియన్నది మాలయైతే,
మాలనే అగుదున్"

"కాని మనుజుని బుద్ధిలోపల
కలవు, తన మేలొరుల కీడును
తలచు వృత్తుల; కానబోయిన
కలచు నెవ్వారిన్.

మాన్పగలిగితి కత్తికోతలు;
మాన్పవశమే మాటకోతలు?
కత్తిచంపును; మాటవాతలు
మానవేనాడున్!"

మాయావాదానికి అప్పారావుగారి సమాధానం వినండి,

"............

కలగవలదట! కల్లయిదియట!
కలిగినది లేదన్నయంతనె
తొలగునట వేదల్!

పుస్తకంబులలోని మాటలు
విస్తరించుచు, ననుభవమ్ముల
తత్వమెరగక. శుకములగుదురు
వొట్టిశాస్త్రజ్ఞుల్!

యెప్పటికి అనుభూతమెద్దియొ
అప్పటికి యది నిక్కువంబే;
యెప్పుడో లోకంబు కల్లగు
ననుట యిపుడెట్లో?"

పై నుదహరింపబడిన గేయాలన్నీ 'లవణరాజు కల'లోనివి.

"లవణరాజుకల జ్ఞానవాసిష్ఠంలోనిది. ఐతేనేం కథను స్వతంత్రంగా వాడుకచేసేడు. సంఘ సంస్కారణ విషయం అందులో చొప్పించినా,

కళకుమట్టుకు కళంకం గలుగలేదు. అందన్న వాస్తవికత్వం నిష్ఠురమైనా, మనస్సుని కలియగొట్టడంలో నెంతమాత్రం వెనుకపడలేదు. ఇది చదువుతున్నంతసేపూ ఆనందమయమైన నిద్రలో మనంకూడా కల గాస్తున్నట్టవుతుంది. రాజుతో మనమూ మేల్కొని కళ్ళునులుపుకొని చూసేసరికి, ఒక కొత్త లోకానుభవం కలిగినట్లవుతుంది." *

"పరులకలిమికి పొర్లి యేడ్చే
పాపికెక్కడ సుఖం కద్దోయి?
ఒకరి మేల్ తన మేలనెంచే
నేర్పరికి మేల్ కొల్లలోయి!"
('దేశభక్తి')

"మగడు వేల్పన పాతమాటది"
('కాసులు')

"..........
నిక్కమేకద చావు నరునకు
యెక్కడెప్పుడు, యెటులగూడిన
నొక్కటేగాదా?
"మ్రందుటన్నది బొందిమార్పుట"
....................."

"ఒకటి ఆయెను రెండుమూడులు
ఒకటి ఆయెను కోటిసంఖ్యలు
పెక్కు లొక్కటిగ జూచువాడే
ప్రాజ్ఞుడన వినమే?"

"బ్రతికి. చచ్చియు. ప్రజలకెవ్వడు
ప్రీతిగూర్చునొ, వాడె ధన్యుడు"

"పంజరమ్ములనున్న పిట్టలు
మంజులారణ్యములు మరచెను
శింజితములౌ కాలిగొలుసులు
శిక్షయని మరచెన్"

* 'ముత్యాలసరములు' రెండవ కూర్పులో కిళాంబి రంగాచారిగారు.

వారిపోయేవారి కొక్కటి
కారవాసః * కల్పదాయెను
దారికాదిది విరియటంచను
తలచుటొకవింత"

"పండగలదని కాయకుడుతురె?
తిండియెల్లిది నేడుతిందురె
అండమందున చిలుక కలదని
అరచి జీరెదరే?"

('డామన్ పితియస్')

గ్రీకు కథను కథావస్తువుగా తీసుకొని అప్పారాయ మహాకవి 'డామన్ పిథియస్' పద్యకథానికను రాసేరు. కావ్యానికి పాశ్చాత్య వాతావరణం, దానికి అనుగుణ్యమైన జిలుగుపనీ తెలుగుసాహిత్యానికి నూతనమైన వొక కొత్త అందాన్నిస్తున్నాయి. మిత్రుని ప్రాణాన్ని రక్షించడానికి తన ప్రాణం త్యాగంచెయ్యడానికి సిద్ధపడ్డ పితియస్, భర్త ప్రాణానికి బదులు తన ప్రాణం యివ్వడానికి సిద్ధపడ్డ పితియస్ భార్యా, మరణశిక్ష నుండి తప్పించుకోవడానికి అవకాశంవుండికూడా ధైర్యంతో శిక్ష ననుభవించడానికి వచ్చిన డామన్ పాత్రలు చాల నైపుణ్యంగా చిత్రించబడ్డాయి. అందుకే మరణశిక్ష విధించిన రాజే యీ మూడు పాత్రల నుద్దేశించి

"వినగతగినది వింటినిచ్చట;
కనగదగినది కాంచినాడను;
మనుజులిద్దరు మగువయొక్కతె
మాన్యులీ జగతిన్"

అంటాడు. విషాదాంతాన్ని సూచిస్తున్నకథ సుఖాంతం అవుతుంది.

దేశంలో వ్యాపిస్తున్న బ్రహ్మసమాజ భావాలు, వీరేశలింగం ప్రభృతుల ప్రచారం, మహాకవికి విగ్రహారాధనపట్ల విముఖత్వం కలిగించేయి. తోటిమానవులు దారిద్ర్యబాధలో కూరుకొనిపోయివుంటే వారికి కాసుసాయం చెయ్యక దేవుడిపేరుతో దుబరా ఖర్చులు చేసేవారినిచూసి అప్పారాయ మహాకవి :

---

* ఎడారి మజిలీ అని భావం.

"మనిషిచేసిన రాయిరప్పకి
మహిమకలదని సాగిమొక్కుతు
మనుషులంటే రాయిరప్పల
కన్న కనిష్టం
గాను చూస్తావేల, బేలా ?

దేవుడెక్కడో దాగెనంటూ
కొండకోనల వెతుకులాడేవేలా ?
కన్నుతెరచిన కానబడడో ?
మెరిగి, కోరిన కరిగి యీడో ముక్తి.

అని ప్రశ్నించారు. ఇంకోసందర్భంలో "దేవుడు చేసిన మనుషుల్లారా ! మనుషులు చేసిన దేవుళ్ళారా ! మీపేరేమిటి ? అని ప్రశ్నించారు.

"గరుడాళ్వారి నఖములు పెరిగి, ఖండన ఐనప్పుడు ఆముక్కలు నావంటి భక్తుడుగా ఆవిర్భవించి పరమతసంహారంచేస్తివి..." అని వైష్ణవమత నాయకుడు మనవాళ్ళయ్యా; శైవమత నాయకుడైన శరభయ్యా తాను శివుడి వృషభవతారాన్నని చలాయించుకొని బతుకుతుంటారు.

"....పాతరోజులైతే, వీళ్ళే అవతారాలయి పోదురు. వీళ్ళ పేరట బొమ్మలునిలిపి దేవాలయాలుకట్టి, మనమే పూజ్జేతుం. మరి బుద్ధుడూ యిలాంటి మనిషేగదండి...." అనీ 'మీపేరేమిటి' అన్న కథానికలో నేడు చలామణీ అవుతున్న దేవుళ్ళ పుట్టుపూర్వోత్తరాలు మనకు కొంత తెలియ జేస్తారు.

కాని 'పాతరోజులైతే...." అన్న అప్పారావుగారి వాక్యానికొక్క మినహాయింపువుంది.

ఉత్తరంవిశాఖజిల్లా ప్రాంతాల్లో యీనాడుకూడా గాంధీజీని అవతారం కింద లెక్కవేసి పూజలూ, ఉత్సవాలూ చేస్తున్నారు. ముడుపులుకట్టడమూ మొక్కుబళ్ళు చెల్లించడమూ జరుగుతూంది. ఇంకోవిచిత్రంకూడావుంది. పురుషుడైన గాంధీజీని స్త్రీగా జమకట్టి 'గాంధీ అమ్మోరు' అని మూర్ఖ ప్రజలు కొలుస్తున్నారు, 'హరిజననిధి' కోసరం గాంధీజీ యీప్రాంతాల సంచారం చేసినప్పుడు, 'గాంధీ అమ్మోరు'కు కట్టిన ముడుపు నిధికోసం అడుగితే సంతోషంగా చెల్లిచారు !

అందుచేతనే అప్పారాయ మహాకవి సామాన్యుని మొదలు సర్వేశ్వరుని వరకూ ప్రశ్నించారు.

"విరిగి పెరిగితి; పెరిగి విరిగితి
కష్టసుఖముల పారమెరిగితి;
పండుటన్నవి ఆశలెన్నో
యెండి రాలగ బొగిలితిన్

అందజాలని పళ్ళకోసము
అఱ్ఱుజాపితి; నేలప్రాకిన
చెట్లపళ్ళను విలువలెరుగక
పాదరక్షల మట్టితిన్

తీపివిరిగి చెరుకువలె ఆ
నాటి కోర్కెలు నేడు బెండౌ
టెంచి నవ్వితి; బుద్ధిచపలత
కొత్త కోర్కెల తగిలితిన్"

"పంజరమ్మననున్న కట్లను
పగలదన్నగలేక స్రుక్కితి
నింగి పర్వగలేని జన్మము
నిస్సంబని రోసితిన్"

('లంగరెత్తుము')

'పై పుటలలో నుదహరింపబడ్డ అప్పారావుగారి తత్త్వాభిప్రాయాలతో మనమేకీభవించకపోవచ్చును. కాని కర్మవాదంమీద ఆధారపడ్డ మన సాహిత్యానికి ఆయన వాస్తవిక పురుషప్రయత్నాన్ని చాలవరకు చేకూర్చి, భూలోకవాసన కలిగించేరన్నది మనం గుర్తించకతప్పదు.

అప్పారావుగారు జీవితంలో అనేకరకాలైన అనుభవాలు, కష్టసుఖాలు అనుభవించారు. ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. శిథిలమవుతున్న శరీరం ప్రాథాన్ని యిముడ్చుకోలేకపోతూంది. మానసికంగాకూడా అశాంతి ఆవరించుకుంటూంది. 'ఉసురుల' పైమహాకవికి 'విసుగు'పుట్టింది. ఆయనకు ప్రాణం తానుమెయ్యలేని భారంగా పరిణమించింది. 'పుడమి' అంతా 'శూన్యంగా' కనిపించింది. తను ఆశించినవన్నీ వికలమయి

పోయేయి. జీవితమనే రేవులో తన ప్రాణమన్న నౌక వుండి లాభంలేదని
ఎంచి ఆ నౌకను రేవు విడిచిపెట్టమన్నాడు; లంగరెత్తమన్నాడు.

అదే 'లంగరెత్తుము' అన్న ఖండకావ్యం.

"ఉసురులకు విసికితివా ? యుద్ధము
కలదు: దేశముకొరకు పోరుము
యుద్ధమా ? ఇకనేమిలోకము :
చాలు ! చాలును ! లంగరెత్తుము"

దీనికి ప్రయోజనం వుంది. '....దేశముకొరకు పోరుము....' అని
తన అంతర్వాణి అప్పారాయమహాకవిని హెచ్చరిస్తూంది. కాని మన
దురదృష్టం కొద్దీ ఆయనకు జీవించడం సాధ్యంకాలేదు. "....ఇకనేమి
లోకము ! చాలు ! చాలును ! లంగరెత్తుము !" అంటూ ప్రాణనౌక జీవిత
తీరాన్ని విడిచిపెట్టింది.

ఈ ఖండకావ్యం 1915 సం. ప్రాంతంలో రాసినది. అంటే
మహాకవి చనిపోవడానికి కొద్ది నెలలకు పూర్వం.

గత మహాయుద్ధజ్వాలలు ప్రపంచాన్ని ఆవరించుకుంటున్న రోజు
లవి, ఈనాటిలాగానే ఆనాడు మనదేశంలో తీవ్రమైన భావసంచలనం
జరుగుతూంది. 'జాతీయోద్యమ చరిత్ర'లో పామిదత్తుగారు అప్పటి
రాజకీయ పరిస్థితుల నీవిధంగా వర్ణించారు.

"యుద్ధ ప్రథమదశలో, సామ్రాజ్యవాదానికి రాజకీయ వుద్యమం
లోని పై తరగతులవారు ఇష్టపూర్వకంగా చేసిన సహకారం లభించింది.
మితవాద నాయకుల చేతులలోనున్న కాంగ్రెస్ తన రాజభక్తిని ప్రకటిం
చింది, యుద్ధాన్ని సపోర్టుచేసింది. యుద్ధకాలంలో జరిగిన నాలు
గు కాంగ్రెసులలో పై విధంగా తీర్మానాలు గావించింది. చివరకు 1918 లో
యుద్ధానంతరం, ఢిల్లీ కాంగ్రెసులోసైతం, రాజుగారికి భక్తిని తెలుపు
తూనూ, "జయప్రదంగా యుద్ధాన్ని ముగియజేసినందులకునూ" అభి
నందన తీర్మానాలను గావించింది, ఇందులకు బదులుగా కాంగ్రెస్ యెడల
అధికారులు అనుకూల వైఖరి ప్రదర్శించారు. 1914 కాంగ్రెసుకు మద్రాసు
గవర్నరు లార్డు పెంట్లండు హాజరయ్యేడు. 1915 కాంగ్రెసుకు బొంబాయి
గవర్నరు లార్డు విల్లింగడన్ హాజరయ్యేడు. 1916 కాంగ్రెసుకు యు. పి.

గవర్నమెంట సర్ జేమ్సుమెస్టన్ హాజరయ్యాడు. ప్రభుత్వ ప్రతినిధులు వచ్చి నప్పుడు హర్షధ్వానాలతో సత్కరించేవారు. యుద్ధం బయలుదేరిన రోజులలో లండన్‌లోవున్న హిందూదేశ నాయకులు, ప్రభుత్వానికి తమ సహాయము యివ్వడానికి త్వరపడ్డారు. లండన్‌లో కాంగ్రెస్ ప్రతినిధుల రాయ బారవర్గము - వీరిలో లజపతిరాయ్, జిన్నా, సిన్హా. యింకా యితరులు వున్నారు - సెక్రటరీ ఆఫ్ స్టేట్‌కు ఒక లేఖను పంపుతూ తమ అభిప్రా యాన్ని యీ క్రిందివిధంగా తెలియజేశారు. "సామ్రాజ్యంయొక్క శీఘ్ర విజయం" కొరకుగాను, "హిందూదేశప్రజలు, సంస్థానాధీశులు, తమశక్తి కొలదీ వెంటనే యిచ్ఛాపూర్వకంగా సహకారంచేస్తారు. ఇంకా హిజ్ మెజస్టీ (రాజు) గారి చేతులలో తమ దేశసంపదను (రిసోర్సెస్) వుంచుటద్వారా పైనచెప్పిన సహకారాన్ని యిచ్చే అవకాశాన్ని పొందుతారు" అని తమ నమ్మకమని తెలియజేశారు. దక్షిణాఫ్రికానుండి అప్పుడే లండన్ వచ్చిన గాంధీజీ హోటెల్‌సిసిల్ వద్ద తనకిచ్చిన సన్మానానికి జబాబుచెబుతూ తన యువక హిందూదేశ స్నేహితులను "సామ్రాజ్యదృష్టితో మాట్లాడమనీ వారి కర్తవ్యాన్ని వారు చేయవలసిందనీ" కోరాడు. సెక్రటరీ ఆఫ్ స్టేట్‌కు వ్రాసిన లేఖలో గాంధీజీ తదితరులూ సంతకాలు చేశారు. దానిలో తన సేవలను తీసుకోవలసిందని కోరాడు :

"సామ్రాజ్యాన్ని క్రమ్ముకున్న సంక్షోభకాలంలో బ్రిటన్‌లో నివశించు చున్న హిందూదేశీయులు యెట్టి షరతులు లేకుండా తాము ప్రభుత్వ చెప్పు చేతలలో (అలాచేయగల్గినవారు) వుండటం మంచిదని మాలో చాలమంది అభిప్రాయడుచున్నారు. మేమూ యీ ఉత్తరానికి అనుబంధంగా వ్రాసిన లిస్టులోని పేర్లవారు, ప్రభుత్వాన్ని మా స్కీమును గ్రైకొనమని ప్రార్థించు చున్నాము........" వాస్తవంలో మితవాద నాయకుల అంచనా వారు తర్వాత తామే విశదపరచినాట్లుగా సామ్రాజ్యవాదానికి యుద్ధకాలంలో యిలా సేవజేయడంవలన హిందూదేశ స్వపరిపాలనా కవాటాలను త్వరగా తెరుస్తున్నామని తలిచారు....ఆ తర్వాత తమ భ్రమతొలగిపోనట్లు మితవాదులు తెలియజేయవలసివచ్చింది."

మన జాతీయోద్యమం భ్రమపడినట్టుగానే సామ్రాజ్యవాదుంపట్ల అప్పారాయమహాకవికూడ భ్రమపడ్డారు. అందుచేతనే గత సామ్రాజ్యవాద మహాయుద్ధకాలంలో భారతీయులు యుద్ధకృషికి తోడ్పడ్డారు. ఈ భారతీయ

దృక్పథాన్నే 'దించు లంగరు' అన్న ఖండకావ్యంలో అప్పారావుగారు వ్యక్తంచేశారు.

"వచ్చెనిది బంగారుకాలము
వాంఛలెల్లను తీర సుజనుల
కాంగిలేయుల ధర్మరాజ్యము
జ్ఞానమును స్వాతంత్ర్య మిచ్చుచు
సంతతము వర్ధిల్లుగావుత !"

పై పంక్తులు చదవగానే మనస్సు చివుక్కుమంటుంది. బ్రిటిషువారి మీదనున్నకోపం, వారి బాగుకోరిన అప్పారావుగారిమీదకు కూడా కొంత చెదురుతుంది. కాని, అదినివేశ స్వాతంత్ర్యం భారతదేశంయొక్క ఆనాటి ఆశయమని మనం జ్ఞాపకముంచుకోవాలి. సామ్రాజ్యవాదుల సుహృద్భావం పట్ల ఆనాటిభారతీయులకు విశ్వాసంవుండేది. "ఆంగిలేయుల ధర్మరాజ్యము" స్వాతంత్ర్యము యిస్తుందన్న నమ్మకముండేది. గతయుద్ధంలో మన జాతీయోద్యమాన్నంతట్నీ దగాచేసినట్టే బ్రిటిషు సామ్రాజ్యవాదులు అప్పారామహాకవినికూడా దగాచేశారు. ఈ వాతావారణంతో మనం పై పంక్తులను చదివినట్టయితే అప్పారావుగారిని అర్థంచేసుకోగలుగుతాం.

ఈపంక్తులు అప్పారావుగారి దేశభక్తికి కళంకంకాదు. సామ్రాజ్య వాదుల మోసాన్ని తెలిపే శిలాక్షరాలు !

ఫాసిస్టు దుష్టశక్తులు పతనమవుతూ, ప్రజాశక్తులు విజృభిస్తున్న యీ ఉషఃకాలంలో, గత ప్రపంచ మహాయుద్ధసమయంలో అప్పారాయ మహాకవి రాసిన ఖండకావ్యం 'దించు లంగరు' కొంతఆసక్తిని కలిగిస్తుంది.

"దించులంగరు దీర్ఘ యుద్ధం
ధర్మపక్షము ముల్లుచూపెను
నరులపీనుగ పెంటపోకల
నాటివెలయును శాంతివృక్షము

పాతసంధులు పాతిపెట్టుము
యుద్ధముల కవి ఉనికిపట్టులు
లోకమంతయు ఏకమై
యుద్ధమునె మారణముచేయును."

ఆ నాటికన్న యీనాడే మహాకవి వాక్యాలు సిద్ధిని పొందబోతున్నాయి!

కాంతితీరంలో యుద్ధనౌకను లంగరు వెయ్యమన్నారు. సుహృద్భావంతో కాకండా వొకరిపై వొకరు రుద్దుకున్న 'ఒడంబడికలు' - వెర్సైల్సు ఒడంబడికలాగనే - నివురుగప్పిన నిప్పువంటివి సమయంరాగానే అవి జ్వలించక తప్పదు. 'యుద్ధములకవి ఉనికి పట్టులు.'

"లోకమంతయు ఏకమై
యుద్ధమునె మారణము చేయును."

ఆ బంగారుకాలంకోసం మహాకవి కలలుగన్నారు. మహాకవి కలలు నిజమయ్యే అవకాశాలు ఆనాటికన్న యీనాడే యెక్కువ కనిపిస్తున్నాయి.

## మ హా పు రు షు డు

మహాపురుషుడు కానివాడు మహాకవి కాలేడు. ఆత్మగతంకాని కవిత్వంలో, కవి కృత్రిమత్వం తొంగిచూడక తప్పదు. ఆత్మవంచకుడైన కవి, తన కృత్రిమత్వాన్ని యితర హంగులతో కప్పిపుచ్చి, పరవంచనం కూడా చేస్తాడు. కొంతకాలం యీ కృత్రిమత్వం సాగవచ్చు. కొందరిని దగాచెయ్యగల సామర్థ్యం సంపాదించవచ్చు. కాని అందరినీ కలకాలం యిది దగాచెయ్యలేను. కాబట్టే, టాల్‌స్టాయ్, షేక్స్పియర్, కాళిదాసు, తిక్కన, పోతన, ఇబ్సన్ మొదలైనవారికి చావులేదు. నక్షత్రాలుగా కొంతకాలం భ్రమపెట్టిన కొందరు కవులు, చమురునిండుకున్న దీపపుబుడ్లగా స్పష్టపడ్డారు. మహాపురుషుడు కాబట్టే అప్పారావుగారు మహాకవి కాగలిగేరు. ఏమహదాదర్శానికి త్రికరణశుద్ధిగా దీక్షవహించారో దానికోసం తన యావజ్జీవితాన్ని నిష్కామంగా ధారపోసిన మహాపురుషుడు అప్పారాయ మహాకవి!

"ఆయన మన ఆంధ్రులలో - మాకు ముందటితరమువారిలో చాలా ప్రసిద్ధ పురుషులు. 'గ్రేట్‌వార్' అనే గత ప్రపంచ సంగ్రామమునకు పూర్వపు దినములలో చెన్నరాజధానిలో గవర్నర్లతోను గవర్నమెంటు మెంబర్లతోను సాయిలాపాయిబాగా మిత్రులవలె నిర్భయముగా యేయంశమును గురించి అయినా ప్రసంగించగలిగిన యీరాజధానీయులలోని బహుకొద్దివారిలో ఆయన ప్రముఖుడు. తనమాటచెల్లి వచ్చినచోటనల్లా మన ఆంధ్రులకు, ఆంధ్రసంస్థలకు సాయపడిన నిశ్చలమైన దేశాభిమాని."

అని అప్పారావుగారి గురించి బుర్రా శేషగిరిరావుగారు రాశారు. అప్పారావుగారు ప్రతిభాశాలి మాత్రమే కాదు; తనకాలంలో చాలా పదును బుద్ధిగల మనిషని పైన ఉదహరింపబడిన వాక్యాలు తెలియజేస్తాయి.

విజయనగర సంస్థానంలో పెద్ద పదవుల్లో వుండికూడా, తన పదవిని ధనార్జనకు వినియోగించలేదు అప్పుడప్పుడు ఆర్థికమైన యిబ్బందులుకూడా పడుతుండేవారు.

కుటుంబఖర్చులతోబాటు, పుస్తకాలకోసమూ పేదవిద్యార్థులకూ పండితులకూ సహాయం చెయ్యడంకోసమూ అప్పారావుగారికి చాలఖర్చు అవుతుండేది. విజయనగరం కాలేజీ గ్రంథాలయంలోవున్న అప్పారావుగారి పుస్తకాలు, యీనాడు అప్పారావుగారి యింట్లోవున్న పుస్తకాలు వేలసంఖ్యలోవున్నాయి. అవి చూస్తే, అనేకవిషయాలలో ఆయనకుగల అభిరుచులూ, పుస్తకాలకోసం ఆయన ఖర్చుచేసిన ధనమూ కొంతవరకు మనమూహించుకోవచ్చు. భాషాశాస్త్రం, చరిత్ర, వేషభాషలు, శిల్పం, చిత్రలేఖనం, విమర్శ, నాటకీయవిషయాలు, సంగీతం, ఆచారవ్యవహారాలు మొదలైన అనేకవిషయాలమీద రాయబడిన పుస్తకాలు ఆయన గ్రంథాలయంలో వున్నాయి.

సుమారు పాతికసంవత్సరాలకాలం విజయనగర సంస్థానంలో ఒక ప్రధాన పురుషుడుగా వుండడమేకాకుండా, ఆనందగజపతిమహారాజుకు, అలకరాజేశ్వరిమహారాణి (మహారాజు తల్లి)కీ, రీవామహారాణి (మహారాజు సోదరికీ) తలలోని నాల్కగా వుంటూకూడా, అప్పారాయమహాకవి ఋణబాధ నుండిసైతం తప్పుకోలేకపోయారు.

"విజయనగసంస్థానమును ప్రస్తుతపు వంశమువారికి నిలువబెట్టి, రాజభక్తిపరాయణుడై, మహాధనికుడు కాగలపరిస్థితులలో వుండిన్నీ, సంస్థానమునకు ఋణపడి గతించినాడు." అని కాంగ్రెసు మాజీ అధ్యక్షులైన యస్. శ్రీనివాసయ్యంగారు తమకు విజయనగరం పెద్దదావా నడిపించుటలో కలిగిన అనుభవ తో అప్పారావుగారి గురించి అన్నారు.

* * * *

అప్పరాయిమహాకవి పెద్దకళ్ళు అందమైనముక్కు విశాలమైన నుదురుతో, చూసినవారికి అసాధారణవ్యక్తిగా కనిపించేవారు.

బహూపల్చనిపనిషి, వేసవికాలంలోకూడా ఉన్నిచొక్కామీద కోటు వేసుకొని, దానిమీద శాలువకప్పుకొని, మేజోళ్ళు తొడుక్కుంటేనే గాని వుండలేకపోయేవారు.

కళ్లు తరుచుగా మూసుకొన్నట్టుండేవి. ఎప్పుడూ ఏదోచదువుతూనో రాస్తూనో వుండేవారు. ఏదోపుస్తకం లేనిదే ఎప్పుడూ వుండేవారుకారు. ఎక్కడికెళ్ళినా పుస్తకాన్నొకటి తీసుకొనిపోతూవుండేవారు. స్నేహితుల యిళ్ళలో పుస్తకాలు మర్చిపోవడం, వారి పుస్తకాలు తీసుకపోవడమూ సర్వసామాన్యంగా జరుగుతూ వుండేది.

అప్పారావుగారు సామాన్యంగా కాగితంమీద యేదోరాస్తూ కనిపించేవారు. మిత్రులమధ్య ఛలోక్తులతోను, హాస్యప్రసంగాలతోనూ సంభాషిస్తూ కనిపించేవారు. బంకు (కోటలో రాజదర్శనానికి వేచివుండే స్థలం) దగ్గర, విద్వద్విషయాలతోబాటు, తను రచించబోయేది అక్కడ సమావేశమైన కవి పండితాది కళావేత్తలతో ముందుగా చర్చించేవారు. మిత్రులు అప్పారావుగారిని 'కింగ్ ఆఫ్ బంక్' అన్న 'బిరుదనామం'తో పిల్చేవారు.

అప్పారావుగారు ఏకాగ్రతగల వ్యక్తి. బంకువద్ద సమావేశమైన వారి మాటల కోలాహలంలోఅయినా, ఒంటరిగా వున్నంత నిశ్చలంగా, తనపని తాను చేసుకునేవారు. స్నేహితులతో కష్టసుఖాలు మాటాడేటప్పుడు యెంతటి చిక్కుసమస్యనైనా సులువుగావిడదీసి వారికి ఆశ్చర్యం కలిగించే సలహాలిచ్చేవారు విజయనగర రాజసభాకృత్య నిర్వహణంలోనూ, సంస్థానపు దావా నడిపించడంలోను, ఆయనచూపిన ప్రతిభ స్నేహితులనుండి "విజయనగర చాణుక్యుడ"న్న బిరుదు సంపాదించింది.

ఈ సందర్భంలో న్యాయశాస్త్రంలో అప్పారావుగారి ప్రతిభనుతెలిపే ఒక వుదంతాన్ని మనవిచేస్తాను.

ఒకసారి అప్పారాయ మహాకవి యన్. శ్రీనివాసయ్యంగారితో రైలుప్రయాణంచేస్తున్నారు. శ్రీనివాసయ్యంగారు ప్రతిభావంతులైన మన చెన్నరాజధాని న్యాయవాదుల్లో వేళ్ళమీద లెక్కపెట్టవలసినవారు. శ్రీనివాసయ్యంగారు అప్పుడు టాకర్ అండ్ సన్స్ అన్న పెద్ద బంగారంవర్తకుల పక్షం మానసష్టందావా నడిపిస్తున్నారు. రైలుప్రయాణంలో ఆయనా అప్పారావుగారూ యీ దావావిషయం ముచ్చటించుకున్నారట. తరువాత కొద్ది

సేపట్లో అప్పారావుగారు ఆ దావాను యేపద్ధతులమీద నడపాలో అన్న విషయాన్ని చిన్న కాగితంముక్కమీదరాసి శ్రీనివాసయ్యంగారికిచ్చేరు. "ఈ పద్ధతితో నేను దావాను నడిపినట్టయితే మా పక్షం గెలవకతప్పదు," అని న్యాయవాది ప్రముఖుడైన శ్రీనివాసయ్యంగారు ఆశ్చర్యంగా అప్పారావుగారి ముఖంలోనికి చూసేరట.

తాను ఎంతకార్యనిమగ్నుడైప్పటికీ, చుట్టుప్రక్కల జరుగుతూవున్న వాటినన్నిటినీ సూక్ష్మంగా కనిపెడుతుండేవారు, వివిధవర్గాలకు జెందిన వ్యక్తులు ఆయాపరిస్థితుల్లో యేవిధంగా మాటాడుతారో యెలాగ ప్రవర్తిస్తారో యెప్పటికప్పుడు రాసుకొనేవారు. నీళ్ళకు పోయే ఆడవాళ్ళ మాటలూ, దెబ్బలాడుకుంటూన్న హిందూ - ముస్లిముల మాటలూ అప్పారావుగారు రాసుకోవడం తానెరుగుదునని ఒక సభలో గిడుగు రామమూర్తిగారు చెప్పారు.

అప్పారావుగారి పరిశీలనను వ్యక్తంచేసే వారి డైరీలలోని భాగాలను రెంటిని ఉదహరిస్తాను :

"25—3—95 సోమవారం : ఏకాంగి — ఈయన ఒక యోగి. అడ్మిరాల్టీకి కృష్ణంరాజుగారి కొరకు వస్తూవుంటాడు — స్ఫోటకపుమచ్చల ముఖము, కొంచమునిడుపు, నలుపుతలగుడ్డ—చక్కటి రంగుజరీ అంగీ— కాషాయరంగుది — మేలురకముబట్ట — మహాజ్ఞానివలె నటన — కొన్ని యింగిలీషు భాషనులుకూడా వున్నవి. మాటల ధోరణి సాగుతూవుంటే చీటికీ మాటికీ చేతిరుమాలుతీసి వాడుతూవుంటాడు. యెవరైనా ప్రశ్నిస్తే పండితుడులాగ తలపంకించుతాడు. మాటలధోరణి తెచ్చిపెట్టుకున్నదిగాని సహజంకాదు. పాపము ముసలికృష్ణంరాజుగారికీ తనివల్ల చాలాడబ్బు ఖర్చవుతూవుంది. వచ్చినప్పుడల్లా రు. 2-8-0 బండి అద్దెకే యిచ్చుకుంటున్నారు. ఈతడు తెలివితేటలుగలవాడే. పామరులను బాగా ఆకర్షించగలడు. అంతసుళువుగా కొట్టిపారవేయవలసిన మనిషివాడు. మావద్దకివచ్చే బ్రాహ్మణులకితడంటే రోత. యిదే దాఖలా. శూద్రులీదని పాదాలకు మ్రొక్కుతారు. కృష్ణంరాజుగారివెంట ఒక వైష్ణవభిక్షువుకూడా తిరుగుతున్నాడు. వాడు పచ్చిదొంగ."

"ముఖమునకు కనుబొమలు కొంత అందంయిస్తవి. పొటమరించుకొని బొద్దుగా వుండేవి బాగుండవు. చర్మమునకు అంటుకొనిపోయినట్లు

వుంటే క్రూరత్వమును సూచిస్తవి. అతిసున్నితముగా పెన్సిలుగీతవలె వుంటే చులకన మనిషి అని సూచన క్రమముగా విల్లువలె వంగి సాధార ణపు దళసరిగలిగి కండ్లకు అతిదూరముగా గాని అతి దగ్గరగాగాని కాకుండా వుంటే అది సుఖమునకుదమిస్తుంది. ఏ వరసగా లయినుగా కాకుండా యెగుడు దిగుడుగా నోగగావుంటే తెలివితేటలను సూచించును."

మహాకవి తన స్వభావంగురించి 'మాట — మంతి'లో యీ విధంగా చెప్పుతున్నారు :

"చిన్నతనంలో బొమ్మలాట నేర్చివుండుటచేత లోకమనే రంగంలో చిత్రకోటిరీతులను ఆటాడే మనుషులనే పాత్రముల సొగసునే కనిపెట్టడము నాకు అలవాటైనది. సొగసులేని మనిషే వుండడు. స్నేహమూ - ప్రేమా - అనే అనాది అయిన్నీ యెప్పటికీ సరికొత్తగా వుండే రెండు వెలుగులను నరులమీద కాంచి తిప్పి కాంచితే వింతవింత సొగసులు బయలుదేరుతవి. అసూయ అనే అంధకారంలో అంతా యేకనలుపే !"

"ముఖంలోశాంతం, మాటల్లోశాంతం, నడవడిలోశాంతం, మెల్లని మాట, మీదపడికొట్టినా తొందరలేనివ్యక్తి. అపరిమితమైన ప్రపంచానుభవం, అపారమైన యింగితజ్ఞానం ఆయన ప్రతిచర్యలోనూ కనిపిస్తుండేవి. [1]

"ప్రతివిషయములోను - తన విషయములోకూడా మితిమోహపు లేకుండా, పరిశీలనగా చూడడము ఆయనకు సహజమైపోయినది ఇట్లే అలవాటులు అభ్యాసయోగంవల్ల సహజమైపోతవి. అనగా అప్రయత్న ప్రవృత్తులవుతవి. అట్టివృష్టి స్వోత్కర్షగాను. స్వాతిశయముగాను విత్రపీగు గాను, మారిపోకుండా ఆయనలో 'హాస్యదృష్టి'కూడా యెన్నోమారులు కనిపెట్టితిని — ఆయన కితరులలో నవ్వుపుట్టించే అంశములు చప్పున పొడకట్టేవి. అది స్వవిషయంలోకూడా వుండేది....ఆయన ఒక విచిత్ర పురుషుడువలె కనపడేవాడు. అవసానకాలంవరకూ వేషం పాతఫక్కీగా రాజదర్బారు లాంఛనముగా వుండేది. ఆ పాతవేషంచూస్తే మావంటి యువకులకు మందహాస కలిగేది. పెద్దలంతా గుర్రపుబళ్ళలో సభలకువస్తే ఆయన పల్లెటూరి మొఖాసాదారులాగి మంచి రెండెడ్ల విశాలపు బండిలో

1. ముత్యాలసరాల రెండవకూర్పు పీఠికలో. కి.శా. బి రంగావారిగారు.

పరుపులూ, తలగడలూ వేసుకొని సుఖాసీనులై వచ్చేవారు. గాలితగుల తుందని రాత్రికూడా గొడుగు వేసుకునేవారు పరులు తననుచూచి నవ్వు కుంటారని ఆయన యెరుగును. అప్పుడప్పుడు తననుగురించీ, తన పిల్లల గురించీ వేళాకోళముగా అనేవారు. ఇట్టి నిష్పాక్షికమైన విమర్శనశక్తి పెంపొందించుకొని, సాహిత్యము, చిత్రలేఖనము, వక్తృత్వము, రచన, నడతలు, శీలములు, వేషభాషలు, దేశపరిస్థితులు, సాంఘిక సంఘటనలను చెన్నపురిలోను, ఇతరత్రాను నిఘాగా చూచిన అప్పారావుగారు...."

అని అప్పారాయమహాకవి గురించి ఆయన పరిచయభాగ్యంగల శేషగిరిరావుగారు రాశారు.

అప్పారావుగారు 1915 ఏప్రిల్ 9 వ తేదీన అంటే చనిపోవడానికి ఏడునెలల పూర్వం — వైద్యసలహాకు పంపడానికి తమదేహస్థితిని రాశారు. ఇది ఆయన మనస్థితినీ, ఆరోగ్యంగురించి ఆయన తీసుకునే జాగ్రత్తనూ కూడా వ్యక్తంచేస్తుంది. అప్పారావుగారు చాలకాలం అజీర్ణరోగంతో బాధ పడ్డారు. చాల కొద్దిగా అహారం తీసుకునేవారు. అయినా జీర్ణంగాక బాధ పడేవారు. ఇది రాసినప్పటికి ఆయనవయస్సు 54 సంవత్సరాలు; బరువు 78 పౌన్లు!

అప్పారావుగారు వైద్యసలహాకోసం రాసిన పట్టికలోనుంచి కొంత భాగాన్ని ఉదహరిస్తాను :

"బాల్యంనుంచీకూడా నాకు అలసట అధికంగా వుండేది. నేను అత్యల్పంగా వుండేవాణ్ని. నేను చేస్తూండే మేధసంబంధమైనపని నాస్నేహితులకు నాకూ చాలా ఆశ్చర్యంకలిగించేది. నేను యువకుడుగా వుంటున్నప్పుడుకూడా నాకు శరీరంలో అలసట కనిపించేది. నాకెప్పుడూ పక్క మీద పడుకోవాలనే వుండేది. శరీరాన్ని కష్టపెట్టడమంటే యిష్టంవుండేది కాదు. అయినా తెలివితక్కువగా, నామేధస్సును కష్టపెట్టేవాణ్ని. మొన్న మొన్నటివరకూ యిలాగే చేసేవాణ్ని........

శీతోష్ణపరిస్థితులు నాశరీరంమీద తొందరగా పనిచేసేవి. ఎప్పుడో గాని సాధారణమైన గాలినికూడా నేను భరించలేను. నడుస్తున్నప్పుడుగాని, బండిలో వెళ్తున్నప్పుడుగాని గాలికెదురుగా గొడుగు అడ్డంపెడతాను. శీతోష్ణస్థితుల కనుగుణంగా, ఒక్కశాలువ లేక శాలువలు, టోపీలు, కోట్లు లేక ఉన్నిదుస్తులు, యిబ్బందిలేకండా వుండడానికి తొడుక్కొనివుండడం

నాకు పరిపాటి, కొండలమీద * చొక్కాపైని చొక్కా కోటుపైని కోటు తొడుక్కుంటాను. నాలుగైదుసంవత్సరాలనుండి ఆరోగ్యకరమైన వాతావరణంగల కొండలమీదకూడా, నాశరీరం బాగుపడలేదు. నామేధస్సుకు విశ్రాంతి యివ్వకపోవడం బహుశా కారణంగావచ్చు. కొండలమీద నాకు ఆకలి బాగావేస్తుంది. కొంచం బలంగావుంటాను. కాని సాధారణంగా బాధపడుతుంటాను."

అప్పారావుగారి ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. ఆఖరు రోజుల్లో ఆయన ఆరోగ్యంకోసం విశాఖపట్నంలో కొన్నిమాసాలు గడిపారు. కాని శిథిలమైన శరీరం ఆమహదాత్మను భరించలేకపోయింది. 1915 నవంబరు 30 వ తేదీని, ఉద్యోగంనుండి విరమించిన రెండుసంవత్సరాల తరవాత అప్పారావుగారు దేహంచాలించారు. ఉద్యోగంనుండి విరమించిన 1913 సం. లోనే ఆయనను మద్రాసు యూనివర్సిటీ సెనెట్ యావజ్జీవిత సభ్యునిగా ప్రభుత్వం నియమించిది.

అప్పారావుగారి సంతానం ఒక కుమారుడు, యిద్దరు కుమార్తెలు, ఒక్కకుమార్తె తప్ప తక్కినవారు సజీవులు.

మహాకవి కావ్యసంతతిలో పూర్తిగాకండా అముద్రితంగా నిలిచిపోయిన నాటకాలు, నవలలు, కథానికలు, పద్యకావ్యాలు మొదలైనవి నలభై యాభై వరకూ వుంటాయి. తెలుగు సాహిత్యం దురదృష్టంవల్ల అవి సంపూర్ణంకాకుండానే మహాకవి మరణించారు. సంపూర్ణమైవుండి కూడా 'మిటిల్డా' అన్న కథానిక ఒక్కటే ప్రచురింపబడిన ఆయన రచన.

నాటకాలకో నవలలకో రాసుకున్న కథాసూచనలు కొన్ని మహాకవి డైరీలలో కనిపిస్తున్నాయి. 1895 మార్చి 27 డైరీలో :

"మాడుగులు లోవయు, పార్కులో జరిగిన అగ్నిప్రమాదమును యేదేనా నవలలో వాడదగినవి."

ఇంకో కావ్యవస్తువు :

"కావ్యవస్తువు— భోగముపిల్ల—తల్లిలేదు—ముత్తవ్వవున్నది—తండ్రి చనిపోవును — యిల్లు వెడలగొట్టబడును — ధనముకొరకాసించని తల్లివల్ల తండ్రిజీవితము బాగుపడినది—ఒక బ్రాహ్మణ రంగేలా—భార్యను వద ...ను—

* రాజకుటుంబీకులతో అప్పారావుగారు వేసవిలో నీలగిరి మొదలైన చల్లని ప్రదేశాలకెళ్ళేవారు.

శ్రమెవెల్లె ఉపాధ్యాయిని — తండ్రిలేదు, (పెండ్లిలేమ—ఊతదు) బి. ఏ. బి. యల్. చదువు మానును."

"1895 సం॥ డైరీనుండి పై నుదహరించిన 'భోగముపిల్ల' కథ సూచననుబట్టి చూడగా, యెంతటి నీచస్థితి వారిలో నైనా మంచి శీలమూ, నిలకడా, సుగుణములూ కనపడవచ్చుననే భావము 'కన్యాశుల్కము' రచించకముందే ఆయనలో దృఢపడినట్లు స్పష్టమగుచున్నది. మనుష్యులలో మంచితీసి నజరుగా—లోకోపదేశ జనకముగా నాటకములలో చూపవలయునని ఆయన నిశ్చయించుకొనియుండును." అని బు|రా శేష గిరి రావుగారు అభిప్రాయపడుతున్నారు,

"ఈరోజున రవివర్మ వ్రాసిన 'రాధ'ను చూచితిని మొద్దుమనిషివలె వుంది. కళ్ళు అంత పెద్దవిగావుండడం బాగులేదు; స్త్రీ ముఖము ఆలాగు వుండునా అనిపించింది. మీది పెదవికొన కొంచెం అణగారినట్లున్నది. మొత్తముపైని చాలా సాధువుగానూ, మొగమాటిగాను కనపడుతుంది. ఆమెలో భోగలాలసత్వమూ, చలాకీచూ_స్తీ చూడడంలోనే స్ఫురించవద్దూ?"

అప్పారాయ మహాకవికి చిత్రలేఖనం, సంగీతం, వ్యవసాయం మొదలైన వాట్లో మంచి అభిరుచి వుండేది.

పైనుదహరించిన ఆయన డైరీలోని భాగం చిత్రలేఖనంలో అప్పారావుగారి పరిశీలనను ద్యోతకం చేస్తుంది. అంతేకాకండా ఆయన స్వయంగా చిత్రలేఖనంలో కృషిచేసేరు. ఆనందజగపతి మహారాజుతో విజయనగరం సమీపంలోవున్న వెలగాడకొండమీదికి విహారానికి వెళ్ళినప్పుడు, అప్పారాయ మహాకవి జ్ఞాపకాన్ని అనుసరించి అద్దంలేకండా తనబొమ్మను తానేచిత్రించుకున్నారు. అప్పారావుగారు వ్యక్తులహావభావాల్ని బట్టి చిత్రించిన బొమ్మల యింకా కొన్ని వున్నాయి. ఆయన చిత్రకళా సాంకేతికాన్ని చాలా పరిశీలనగా అవగతం చేసుకున్నారు. పాశ్చాత్య చిత్రాల్ని తెప్పించి పరిశీలించేరు. పాశ్చాత్య చిత్రాల్లో మేఘాలు అందంగా వుండడానికి అక్కడవున్న శీతోష్ణ పరిస్థితులు కారణమని అప్పారాయ మహాకవి అవగతం చేసుకున్నారు.

ఇదేవిధంగా మహాకవికి సంగీతంలోకూడా చాలా ఆసక్తి వుండేది. ఆయన వీణ వాయించేవారు. తాను రచించిన 'నీలగిరి పాటల' కు తానే స్వరాలు వేసుకున్నారు.

అప్పారావుగారు చరిత్ర పరిశోధన, భాషాశబ్దశాస్త్రం నాటకకళ మొదలైనవాట్లో విశేషకృషిచేసిన ఆనాటి మహారధులలో ఒకరు. ఆయన రచనలు అధికంగా లేకపోవడానికి అనారోగ్యం, వారు జీవించిన ఏభైనాలుగు సంవత్సరాలలో పదిహేను సంవత్సరాలు మింగిన సంస్థానపు వారసత్వపుదావా, వ్యవహారిక — గ్రాంధికభాషల సంఘర్షణలతోబాటు అనేక విషయాల్లో అప్పారాయ మహాకవికి ఆసక్తివుండడం కారణమనుకుంటాను. నూతన శకస్థాపకుడనీ, విప్లవకారకుడనీ ఆయనకు బ్రహ్మరధం పట్టినవారే ఆయన ఆదర్శాలనుండి దిగజారి నవ్యసాహిత్యాన్ని ప్రేయసిమయంగా చేయడానికి, అప్పారావుగారి ఆదర్శాలను సరిగా వంటబట్టించుకోకపోవడమే కారణం కావాలి. అప్పారావుగారి రచనలే అధికసంఖ్యలో వుంటే, అవి వారి చెవినిల్లుకట్టుకొని పోరి పలాయన సాహిత్యానికి ప్రవేశం కలుగకుండాచేసి వుండేవేమో. తత్కారణంగా సాహిత్యంలో అప్పారాయ మహాకవి ప్రవేశపెట్టిన అభ్యుదయభవాలు కావలసినంతగా అభివృద్ధికాలేదు. ఇది తెలుగు సాహిత్యంలో విప్లవప్రతీఘాతమైన విషాదసంఘటన.

ప్రపంచ సాహిత్యాలలో దేనికికూడా తీసిపోని ఉచ్ఛస్థితిని అనుభవించిన తెలుగు సాహిత్యం, తక్కిన భారతీయసాహిత్యాలతోబాటు వెనకపడిపోయింది. ముఖ్యంగా పాశ్చాత్యసాహిత్యాలు ఒకశతాబ్దంముందునడిచాయి. మఠంవేసుకొని కూర్చున్న తెలుగుసాహిత్యాన్ని నిలబెట్టి ముందుకు నడిపించవలసిన బాధ్యత వీరేశలింగం, అప్పారావు, రామమూర్తిగార్ల మీద పడింది.

ఆ పురోగమనంకోసమే అప్పారావుగారు 'కొత్తపాతల మేలుకలయిక'తో కొత్త సాహిత్యాన్ని సృష్టించారు. పాతదైన మన సంస్కృతిని కొత్తదైన పాశ్చాత్య సంస్కృతితో మేళవించి అప్పారాయమహాకవి అపూర్వమైన సాహిత్యసృష్టిచేశారు. మోలియర్‌లోని హాస్యాన్ని ఇబ్సన్‌లోని సంస్కారాశయాల్ని, తెలుగువాతావరణంతో మేళవించి కన్యాశుల్కాన్ని రచించారు. సానిని కథానాయికగాచేసికూడా బూతును వెలివేసిన మొట్టమొదటి కావ్యాన్ని తెలుగు సాహిత్యాన్నికి ప్రసాదించారు. కృతకమైన భాషకూ భావాలకూ స్వస్తిచెప్పి, ముద్దుకృష్ణగారన్నట్టు "ముందురాగలవారికి మార్గక్షౌర్ట్రా సంపాదించినారు." ప్రజాసాహిత్యానికి బలమైన పునాదులు వేశారు.

ప్రజల్నీ బంధుమిత్రుల్నీ పొట్టబెట్టుకున్న మహాభారతయుద్ధం తర వాత శూన్యమైన రాజ్యాన్ని పరిపాలించవలసివచ్చిందని ధర్మరాజు విలపి స్తాడు. ఆభావాన్నే హెచ్చరికగాచేసి అప్పారాయమహాకవి :

"దేశమంటే మట్టికాదోయి
దేశమంటే మనుషులోయి"

"యీసురోమని మనుషులంటే
దేశమేగతి బాగుపడునోయి ?"

అనీ తెలుగుజాతిని ప్రబోధించారు.

"మనిషిచేసిన రాయిరప్పకి మహిమకలదని సాగిమొక్కుతు, మనుషులంటే రాయిరప్పలకన్న కనిష్టంగాను చూస్తావేల ?" అని ప్రశ్నిం చారు. మాధవసేవకన్నా మానవసేవే పరమధర్మమని ఎలుగెత్తి చాటేరు.

దేవుళ్ళూ, రాజులూ, ధనికులూ ఆక్రమించుకొన్న సాహిత్యాన్ని ప్రజలకు సంపాదించిన మహాపురుషుడు అప్పారాయమహాకవి : సాహిత్య విప్లవకారకుడై నూతన సంస్కృతిని నెలకొల్పిన మహాపురుషుడు !

అప్పారాయమహాకవి తెలుగుజాతికి పెన్నిధి! ప్రపంచకవుల కుటుంబానికి చెందిన విశ్వకవి !